# బానిస బ్రతుకు



అనువాదకులు:

చెరుకుపల్లి సీతారామమూర్తి

# బానిస బ్రతుకు

**(UNCLE TOM'S CABIN)**

అనువాదము

## చెరుకుపల్లి సీతారామమూర్తి

ప్రకాశకులు :

## ది మోడరన్ బుక్ హౌస్,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్,

[illegible]ాఖి రోడ్ : : మచిలీపట్టణము

అంకితము



ముద్దుకృష్ణగారికి



# 1

అప్పుడు అమెరికాలో కెంటకి రాష్ట్రియములో ఒక పెద్దమనిషి ఇంట్లో భోజనానంతరము ఇద్దరువ్యక్తులు కూర్చుని మాట్లాడుకుంటున్నారు. ఆ గృహయజమాని షెల్బీ అనే ఆయన. ఆయన ధనవంతుడు. అయినా ఆయనలో దయ ఉట్టిపడుతున్నది. ఆ రెండవవ్యక్తి హైలీ అనే ఆయన. ఆ హైలీ సర్వవిధాలా షెల్బీగారికి విరోధి, దుస్తులు అట్లాగే ఉన్నవి మాటతీరుగూడ అట్లాగే ఉన్నది. ఏదో దీర్ఘముగా వారు ఆలోచిస్తున్నారు.

"చూడండి" అని షెల్బీగారన్నారు "నేను బాకీపడిన మొత్తమునిలువ, టామ్ ఒక్కడే చేస్తాడు. టాము నిదానమైన వాడు, నమ్మకస్తుడు. చాల ఉత్తమతరగతికి చెందిన వాడు. అంతేగాక చాల మతభక్తి గలిగినవాడుకూడా".

"ఆ ఈనీగ్రోలు మతభక్తిపరులని కొందరు నమ్మరండీ" అన్నాడు హైలీ.

అయితేసరే మరి నమ్మకస్తులైనవారెవరైనా ఉంటే, వారిలో టాము నిజాయితీపరుడు. అతడు పూర్తిగా నమ్మదగినవాడు. అంటే నా స్వానుభవము మీద ఇది చెబుతున్నాను. ఆయనతోడ ఈయెడబాటు నాకెంతో దుఃఖాన్ని కలిగిస్తుంది. ఇది నేను చెప్పకతప్పదు ఆయనయెడ. మరి మీా

రతనిని కొంటున్నారుగనుక ఆ మిగిలిన బాకీకూడ రద్దు వాస్త వముగా అంతేనండి హైలీగారు రద్దు చేయించండి అన్నాడు షెల్బీ.

"చూడండి తన వ్యాపారములో ప్రతివాడు యెంత నిజాయితీపరుడో నేనూ అంతే అయితే మీరు నాతలకుమించి నది అడుగుతున్నారు" అని హైలీ అన్నాడు.

వారిద్దరు కొంతసేపటి వరకు యేమీ మాట్లాడుకో లేదు. చివరకు షెల్బీగారె "సరె అయితెమరియేలా ఈ వ్యవ హారము ఫైసలు చేద్దామనుకున్నారు."

ఆ చూడండి "టాముతోడికూడా అమ్మటానికి మీ వద్ద ఓచిన్న పిల్లకాని పిల్లాడుకాని లేడూ!"

లేడు. నాచేతుల్ని నే నమ్ముకోలేను, ఆ అది నిజము అన్నాడు షెల్బీ.

తలుపు అప్పుడే తెరవబడింది. నాలుగైదేండ్ల బాలుడు లోనికి వచ్చాడు. ఆ పిల్లవాడు మంచి పెంపకములో పెరిగి యెంతో ఆకర్షణీయముగా ఉన్నాడు. ఒక్క ఈలవేసి షెల్బీ గారు ఆ పిల్లడిని పిలిచి కాసిని బటానీలు బెట్టారు. ఆ పిల్లడు బటానీలకోసము పరుగెత్తుకొని వెళ్ళి ముసిముసి నవ్వులు నవ్వేను.

"ఆ పిల్లడిని టాముతో అమ్మండి యేదోవ్యవహారము ఫైసలు చేస్తాను" అన్నాడు హైలీ.

తలుపు మళ్ళీ తెరవబడింది. ఓ అందమైన రంగు జాతి స్త్రీ ఆ గదిలోనికి ప్రవేశించింది (నీగ్రో రక్తము లేక పోయినా శ్వేతజాత్యేతరులను అలా పిలిచేవారు). ఆమె రూపు రేఖలు ఆపిల్లడి తల్లియని స్ఫురింపచేస్తున్నది. ఆ హైలీ ఆమెను చూచినచూపు యేదో మానవచరాస్థిని అమ్మకము మార్పిడిచేయు వ్యాపారివలె ఆతను చూచాడు.

ఆమె "అయ్యా క్షమించండి హేరీ యెక్కడున్నాడో అని వెదుకుతున్నాను" అన్నది. ఆపిల్లవాడు తక్షణము ఆమె వద్దకు పరుగుతీశాడు. ఆగదిలోనుంచి వాని నెత్తుకొని బయటకు తీసుకొని పోయినది.

"ఆపిల్లవాడిని నాకిచ్చివేయి షెల్బీ" అన్నాడు హైలీ. అది నీకు లాభసాటి బేరమె. నేనా వాడిని దక్షిణాదినియెక్కడో అమ్మతాను. ఈఅందమైనవాళ్ళను కొంతమంది తమగుస్తుము వద్ద పనికని కాపలా పెట్టుకుంటారు, వాళ్ళకు మంచిధరకూడా పెట్టుతారు.

అయిష్టతతో షెల్బీగారు ఇటునటు కదిలారు "అమ్మలేనండి తల్లినుండి పిల్లలను వేరుచేయుట నాకిష్టము లేదండి" అన్నారు.

"ఆ అందులో యేముందోయి ఈ నీగ్రోలు తెల్లవారి వలె అనుకుంటారనుకోకు. వాళ్ళేమైనా పెళ్ళాం పిల్లలను పోషించగలరా. "యేమోనండి నావాళ్ళు అట్లాంటివారుగారు" అన్నాడు షెల్బీ.

"ఇదె మీ కెంటకీవాసులందున్న దోషము" మీరు నీగ్రోలను పాడుచేస్తున్నారు. అందుచేత నీగ్రోలకు అమ్మేటు అంటె యేమిటో కొనటమంటె యేమిటో యెరుగరావె. మది ఇదివారికి తెలిసి ఉండాలి. చూడండి షెల్బీగారు నేను నీగ్రోలను మీవలె చూడకపోయినా నా వ్యాపార నిమిత్తము నేను బాగానే చూస్తాను" అన్నాడు హైలీ.

ఇది వినగానే షెల్బీగారికి యెంతో మనస్సంకోచము తోచింది కాని యేమీ జవాబు చెప్పలేదు.

కాస్తసేపు తాళి ఆ హైలీగారు "ఆ యేమంటారు" అని అన్నాడు. అన్నతరువాత ఆయన వెళ్ళిపోవ సిద్ధపడిపోయాడు.

"మంచిది సాయంత్రము రండి అప్పుడు నేను చెబుతాను" అని షెల్బీగారు అనగానే హైలీ ఆ గదిలోనుంచి వెళ్ళి పోయాడు.

షెల్బీ తెల్లవాడైనా దయా స్వభావము గలవాడు. ఆయన క్షేత్రముమీద అసంఖ్యాకులగు బానిసలు సుఖ జీవనాన్ని సంతోషముతో గడుపుతున్నారు. అయితే దేశంలో బానిసలన్నవారికి రక్షణ లేదు. వారికిమిగిలింది భీతిమాత్రమే. వారు ఆనందమయ జీవితము ధనవంతుల యిళ్ళలో అనుభవిస్తున్నా న్యాయశాస్త్రదృష్ట్యా వారు కేవలము మార్పిడిచేయదగు వస్తువులవంటివారె. సజీవులైనా, పుత్రపుత్రీ సంతానవంతులైనా, మాతాపితలుగూడ యజమానియొక్క సజీవచరాస్తిగానే

న్యాయశాస్త్రము వారిని పరికిస్తుంది. వస్తువులవలె అలంకరిస్తారు అమ్మేస్తారు ఇష్టమునచ్చినట్లు అమ్మేస్తారు కొనేస్తారు. గృహ యజమాని డబ్బు ఇక్కట్టులోబడి నష్టము వచ్చినా, మృతిపొందినా ఆయనవెనుక్క బానిసలను అమ్మివేస్తారు. మన షెల్బీగారి విషయములోగూడ ఇదె జరిగినది. ఆయనకు తన స్వంత వ్యాపారములో నష్టము వచ్చినది. దానిలో ఆ హేలీగార్కి పెద్దమొత్తము బాకీతేలారు. ఇక అప్పుదీర్చడానికేగో ఒకనిర్ణయము చేయనలసి వచ్చింది. అయితే ఆయనకు తన టామునిగాని హేరీనిగాని అమ్మటము యేమాత్రము ఇష్టములేదు. అందుకనె ఆ వ్యాపారిని పంపించి వేశారు; పంపించివేయగల్గినా తాను ఆ వ్యాపారికి లొంగక తప్పదని షెల్బీగార్కికూడా తెలుసు. యెందుకంటె వారి కంతకంటె వేరు గత్యంతరము లేదు.

హేరీకోసము ఎలిజా ఆగదిలోకి వచ్చినపుడు, ఆ వ్యాపారి హేలీ తన కొడుకును కొంటాననటము విన్నది. ఇంకా విందామనుకున్నది. కాని ఇంతలో యజమానురాలు వెనుకనుండి పిలిచింది. ఇదె ఆమెను చాలఆందోళన పెట్టింది. యజమానురాలు ఎలిజా ముఖములో భయాన్ని చూడ గల్గింది "యేమే యేమిటివచ్చిందే నీకు" అన్నది ఆమె.

"అమ్మా అమ్మా యెవ్వరో వ్యాపారిటమ్మా వచ్చాడమ్మా నేనువిన్నానమ్మా అమ్మా యేమంటారమ్మా అయితే అయ్యగారు పిల్లాడిని అమ్మేస్తారంటారా"

"ఛీ లేదు లేవే తెలివితక్కువపిల్లా అయ్యగారు పిల్ల వాడిని యెప్పుడు యెవ్వరికి అమ్మరు. హారీని నిన్నుండి వేరు చేయడమంటూ యెప్పుడూ లేనే లేదు. ఊరుకోరా నవ్వుతూ ఉండు. ఆ ఈదుస్తులకు గుండీలు బెట్టి మరి ఈ జుట్టుముడిని క్రొత్తపద్ధతిలో త్రిప్పి వేయి."

"కాని అమ్మ అమ్మగారు......"

"ఇదిగో ఎలిజా నేనుమటుకు హారీని అమ్మటానికి యెప్పుడూ ఇష్టపడనని తెలుసుకో. నీవున్నూ యెప్పుడూ వానినిగూర్చి మనసులో పెట్టుకోకూడదు. ఇక ఈ ఇంటికి వచ్చిన ప్రతివాడు నీకుమారుని తీసుకుపోవడానికే అని అనుకో కూడదు."

ఈ అనునయ వాక్యాలకు ఎలిజా మనసు కొంత స్థిమిత పడినది. తన వెర్రిభయానికి తానె నవ్వుకొని ఇంటిపనిచేసు కుంటూ ఉన్నది.

యజమానురాలైన మిసెస్ షెల్బీ చాల తెలివైన మనిషి. ఆమె ఉదాత్తభావాలు గల్గినది. మంచి మతభక్తి గల్గినది. ఆమెభర్త ఆమె మంచితనాన్నిచూచి ఆమెను యెక్కు వగా గౌరవించేవారు. తనపనివాళ్ళ సుఖమునకై వారివిద్యాభి వృద్ధికై, వారియందు మతభక్తి కల్గించుటకై షెల్బీ తన భార్యకు సర్వస్వాతంత్ర్య మిచ్చెను. ఆయనకు వేరు గత్యంత రము లేకపోవుటచేతనె. తనుచేసిన విషయాన్నిగూర్చి తన

భార్యకు చెప్పటము యెలాగా అని షెల్బీగారు యెంతో మనోవేదన పడుతున్నారు.

ఆ యజమానురాలికి తనభర్త సహృదయుడని, దయామయుడని, యోచనాపరుడని యెరుగునే కాని ఆతని ఆర్థిక ఇబ్బందులను యెరుగదు. అందుచేత ఆమె ఎలిజాతో సదుద్దేశముతోనే ఆమాటలు చెప్పింది. తనభర్త మంచివాడని నమ్మిన వ్యక్తియగుటచేత ఆవిషయాన్ని గూర్చి ఆమెఆరాత్రి ఆతనతో మాట్లాడలేదు.



## 2

ఆ యజమానురాలు ఎలిజాను యెంతో జాగ్రత్తగా పెంచుతూవచ్చింది. ఆమె యెంతో అందమైనది. పొరుగు పొలములో పనిచేసే ఆసామివద్ద నున్న ఒక బానిసను పెళ్ళి చేసుకున్నది. అతనిపేరు జార్జిహారిస్. అతను అసాధారణమైన శక్తివంతుడు, మంచినడవడి గలవాడు.

అయితే ఆ యువకునకు నిర్దాక్షిణ్యమైన క్రూరుడైన యజమాని దొరికాడు. ఆతని యజమానియైన హారిస్ అతన్ని ఒక ఫ్యాక్టరీలో పనిచేయుటకు అద్దెకిచ్చాడు. జార్జి చాల తెలివైనవాడు. ఫ్యాక్టరీలో పనిని తేలికగా చేయడానికి ఒక

యంత్రాన్ని గూడ నిర్మించాడు. ఇప్పుడతడు పనిచేస్తున్న ఉత్పత్తిదారునకు ఇతనంటె యెంతో గౌరవము. ఇతర పని వాళ్ళకన్న ఇతనికి యెక్కువ స్వాతంత్ర్య మిచ్చేవాడు. పని అయిపోయిన తరువాత అతను ఇష్టమువచ్చినచోటకు పోయే అవకాశము కల్పించాడు. తీరిక సమయములో ఎలిజాతో పరిచయము యేర్పరచుకున్నాడు. ఎలిజాను షెల్బీపతి అను మతితో వివాహము చేసుకున్నాడు. భార్యవద్దకు చాలమారులు వస్తూపోతూ ఉన్నాడు. కాని పాపము వాళ్ళ కిద్దరుపిల్లలు పుట్టిపోయారు. ఈపిల్లవాడు హెరీ పుట్టిన తరువాతనే ఎలిజా ఆ దుఃఖాన్ని మ్రింగి తన ప్రేమఅంతా ఆపిల్లవానిమీద పెట్టుకున్నది.

కాని జార్జి తనపనిలోచూపిన చాకచక్యమునకు విజయమునకు ఆతనియజమాని హారిస్ ఈర్ష్యపొందాడు. బానిసయైన వాడు తనకన్న తెలివైనవాడుగా ఉండటముచూచి సహించలేకపోయాడు. ఒకరోజున హఠాత్తుగా జార్జికియ్యాల్సిన జీతమిచ్చివేయాల్సిందని, తాను జార్జిని తీసుకుపోతానని చెప్పాడు.

"హారిస్‌గారు అయినా ఇంతతొందరలోనె యెందుకు"

"తొందరేమిటయ్యా నామనిషినినేను తీసుకుపోతాను" అన్నాడు హారిస్. ఆ ఫ్యాక్టరీవాడు జార్జి జీతము యెక్కువ చేస్తానన్నాడు. కాని అతనెంత ప్రయత్నించిన లాభము లేకపోయింది. తన యజమాని క్షేత్రముమీద పనిలోకిరాగానె జార్జి మళ్ళీ పూర్వపు కాఠిన్యతతో చూడబడేవాడు. జార్జి

యేమీగా యెదురు చెప్పేవాడుగాదు. కాని లోన అతనిగుండె మండిపోయేది. ఆతనిలోనున్న మానవత్వము యెదురుతిరిగేది. మళ్ళీ ఆఫ్యాక్టరీ యజమాని వచ్చి జార్జిని పంపండి పనిలో పెట్టుకుంటా నన్నాడు.

ఆ యజమాని యేమైనాసరె కాదుకూడదని అన్నాడు. "నీ వల్లా నావద్దకు రావద్దు. ఇది స్వతంత్ర రాజ్య మయ్యా. వీడు నా వాడు. నా కిష్ట మొచ్చినది నేను చేస్తాను. చేసుకుంటాను" అన్నాడు హారిస్.

దానితో జార్జి ఆశ నిరాశ మైనది. అతని ముందు అంతులేని చాకిరి, నిర్దాక్షిణ్యమైన యజమాని క్రౌర్యము గాన్పించినది.

అటు షైలీతో బేరము కాగానే షెల్బీగారు భార్యతో మిత్రులనుచూడ వెళ్ళారు. ఆ బండి సాగిపోవు టను యెలిజా వరండాలో నుండి చూచింది. తన భుజము మీద చేయి పడుటచే హఠాత్తుగా వెనుదిరిగి తన భర్తను చూచింది. మిమ్మల్ని చూస్తేనె నా కానందముగా ఉన్నది. నా గదిలో మాట్లాడుకుందాము చూడండి. హేరీ యెంత ముద్దొస్తున్నాడో అని యెలిజా తన చిన్న కుమారుని ముద్దు పెట్టుకొని, తండ్రికి అందించింది.

"ఛీ వీడు పుట్టకపోతేనె మన కెంతో బాగుండేది" అని అయిష్టతతో జార్జి అన్నాడు. "ఛీ నేను కూడ పుట్టక పోతేన బాగుండేది."

ఎలిజా భయపడి ఆశ్చర్యముతో భర్త ప్రక్కన కూర్చున్నది. "ఓ జార్జి అలా అంటావేమిటి."

"అవును ఎలిజా యేమున్నది నాకు బాధ తప్ప, ఇంకా యెంత ప్రయత్నిస్తే మటుకు యేమి లాభము. నేను నిన్ను గూడ నాతో అధఃపాతాళానికి ఈడ్చుకుపోతాను. ఈ జీవితము వల్ల యేమిటి ఉపయోగము. నేను చస్తే బాగుండేది."

"అవును అది భయంకరమైనది" అని ఎలిజా అన్నది. కాని యెంతైన హారిస్ నీ యజమాని గదా!

"ఆ నా యజమాని!— ఆ యెవరు ఆయన్ని నా యజమానిగా విధించారు. నేను ఆయనలాంటి సాటి మానవుడినే. అతని వ్యాపారాన్ని అతనికన్న బాగా నడపగలను. అతను చదివినదాని కన్న యెక్కువ చదువుతాను. బాగా వ్రాస్తాను. నేను ఇదంతా అతని సహాయము లేకుండానె నేర్చుకున్నాను. అయినా నా యజమాని యేం చేస్తున్నాడు. నా చేత గాడిదచాకిరి చేయిస్తున్నాడు. ఈర్ష్యచేత నేను చేయగల్గిన పనులు చేయకుండా చేయడానికి కూడా కృతనిశ్చయుడైనాడు. నాచేత మహా కఠినమైన అసహ్యాకరమైన పనులు చేయిస్తున్నాడు. ఇంకా బెదరిస్తున్నాడు. ఆయన నా పొగరణుస్తాడట. కావాలనే నా నైతిన పాడుపనులన్నీ పెట్టుతాడు."

"జార్జి ఇలా నీ వనటము యెప్పుడు వినలేను, అయితే నీ వేదో భయంకరమైనది చేస్తావని నాకు భయంగా ఉన్నది. నీ వెంతో బాధపడుతున్నావని తెలుసుకొని నా కోసము హారీ కోసము జాగ్రత్తగానె ఉండు" అని అన్నది.

"నేను జాగ్రత్తగానె ఉన్నాను. ఇదంతా శృతి మించి రాగాన పడుతున్నది. నేనిక బాధ భరించలేను. నేను నా పనిని పల్లెత్తుమాట యెదురు చెప్పకుండా చేశాను. తీరిక సమయములోనె యేదో చదువుకుంటూ వ్రాసుకుంటూ ఉండేవాడిని, కాని ఇంకా యెల్లాగో అతను నన్ను పట్టుకొని పీడించి ఇంకా పనులు చేయాలని ఆజ్ఞాపిస్తున్నాడు. నాలో దెయ్యము ఆవేశించిందట. నిన్న బండిలోకి సామాన్లు యెత్తుతున్నాను, అక్కడ కొరడాతో మా యజమాని చిన్నకొడుకు ఆడుతూ ఉన్నాడు; నేను గుఱ్ఱము బెదురు తుంది ఆపమని చెప్పాను, మళ్ళీ చెప్పాను—వాడు యెదురు తిరిగి నన్ను తన్నాడు; అక్కడ తన తండ్రితో నేను వాడితో పోట్లాడినట్లు చెప్పాడు. యజమాని వచ్చాడు; చాల కోపముతో మండిపడ్డాడు; ఆయనవచ్చి నీకు యజమాని యెవ్వరో తెలియచెబుతాలేరా" అని అన్నాడు,— ఆయన నన్ను చెట్టుకు కట్టివేశాడు. ఆయనగారు తన చిన్న కొడుకును నన్ను కొట్టడానికిగాను చేతికి కొరడా ఇచ్చి, అలిసిపోయేవరకు కొట్టమంటె, వాడు నన్ను కొట్టేడు. ఇది వాడికి యెప్పుడో ఒకప్పుడు గుర్తుకు వచ్చేటట్లు చేయాలి" అన్నాడు.

ఆ యువకుని ముఖమందలి భావము ఆతని భార్య ఎలిజాకు భయము గలుగజేసింది. "యెవరాయనను నా యజమానిగా నిర్ణయించారు" అన్నాడు జార్జి.

"సరె" నేను నా యజమానుని యజమానురాలికి విధేయురాలై యుండాలని యెల్లప్పుడు భావిస్తాను. అల్లా లేక పోతే నేను సత్క్రైస్తవరాలను గాను.

"నీవలా చెప్పటానికి తగిన కారణ మున్నది. వాళ్ళు నిన్ను మంచిగా పెంచారు, అన్నం పెట్టారు, బట్ట లిచ్చారు, బోధ చేశారు నిన్ను. నన్నో వాళ్ళు తన్నారు. కొట్టారు ప్రాణము తీస్తానని శపథము పలికారు. నా కూటికోసము మూరింత లెక్కువ పని చేయాల్సి వచ్చినది. నే నింకా భరించలేను," అన్నాడు మహా కోపతీక్ష్ణ దృష్టితో.

ఎలిజా హడలిపోయినది. నోట మాట రాలేదు. ఆమె తన భర్తను ఈ విధముగా యెప్పుడు చూడలేదు.

"ఇప్పుడు ఆ యజమానంటాడు, ఇంకొక క్షేత్రపు వాని దాసిసను పెళ్ళిచేసుకోనియ్యటము తన పొరపాటనట. అతను షెల్బీగారిని ఇతరులను చూచి అసహ్యించుకుంటాడు, యెందుకంటె వారికి గీర్వాణమట. నీ దగ్గరనుంచి నేను గీర్వాణము నేర్చుకుంటున్నానుట. అందుచేత ఇహ ఇక్కడకు రాకూడదట. నేను ఇంకొకతెను పెళ్ళిచేసుకొని తన క్షేత్రము మీదనె నిలిచిపోవాలట. నిన్నటిరోజున, విశానా

అనే స్త్రీని పెళ్ళిచేసుకుంటావా లేక నది అవతల దక్షిణాదిన అమ్మివేయమంటావా అంటాడు'' అని జార్జి అన్నాడు.

''కాని నీకు నాకు చర్చిలో తెల్లవారినలెనె పెళ్ళయి నదిగదా'' అని ఎలిజా అన్నది.

''బానిసకు పెళ్ళేమిటి, పెళ్ళిచేసుకోటానికి హక్కు లేదని నీకు తెలియదు. ఈ దేశములో ధర్మము ఒప్పదు, వాడు మనలను వేరుచేయ తలపెట్టితే, నేను నిన్ను పొందే హక్కుగల్గి యుండను. అందుకే నేను నిన్ను చూడకపోతేనె బాగా ఉండేది. చూడు మన హారీవంక, వీడు పుట్టకపోతేనె యెంతో బాగుండేది గదూ. ఎందుకు వాడికి నాలాగానె యెప్పుడో ఒకప్పుడు ఇలాగె జరుగుతోందిగదా !''

''కాని మా యజమాని దయగలవాడు'' అన్నది ఎలిజా.

''అవును. కాని ఆ యజమాని చచ్చిపోతే, ఆతని ధనమె పోతె, మన పిల్లగాడు అందమైనవాడైతె నేమి, అందగాడైతెనేమి గనుక ! చూడు ఎలిజా ఆ పిల్లవానిలో నీవు చూచె ప్రతి మంచి విషయము ఆనందమిచ్చేదేదో అదే నిన్ను కండ కండలుగా రంపపు కోతగా కోస్తుంది. వాటికి వ్యామోహపడి వాడు నీవాడు కావాలనుకుంటున్నావు. అదంతా నీకు నరక బాధయె'' అని జార్జి అన్నాడు.

అతని మాటలు ఆమె హృదయముపై సమ్మెటపోటుల వలె పడ్డవి. ఆమెకు మళ్ళీ ఆ వ్యాపారి తన యజమానితో మాట్లాడవచ్చిన దృశ్యము కళ్ళకు గట్టినది. తెల్ల మొగము వేసి ఆందోళనతో పిల్లవానికోసము చూచినది. షెల్బీగారి చేతికఱ్ఱను గుఱ్ఱముగాచేసి హారీ వరండాలో స్వారీ చేస్తున్నాడు. ఎలిజా తన గుండెలోని బరువును భీతిని భర్తకు చెప్పేదేకాని వద్దనుకున్నది. అయ్యో పాపము ఆయన కష్టాలాయన కున్నవి. అయినా అమ్మగారు అంతగా ద్రోహము చేయరులె అని అనుకున్నది ఎలిజా, "కాబట్టి ఎలిజా నేను నీకు వీడ్కోలు తెలుపటానికి వచ్చాను. నేను వెళ్ళిపోతున్నాను" అన్నాడు జార్జి.

"అయ్యో జార్జి యేది, జార్జి దారియేది, ఎక్కడకు పోతావు"? అన్నది. "కెనడాకు" అన్నాడు నిటారుగా నిలుచుని. నేను వెళ్ళినతరువాత డబ్బుసంపాదించి దాచి, దానితో నిన్ను, పిల్లవాడిని కొనుక్కొనిపోతాను. అదిఒకటే మిగిలిన ఆశ. నీయజమాని దయగలవాడు గనుక, నిన్ను అమ్మటానికి తిరస్కరించడనుకుంటాను. భగవదనుగ్రహముంటె ఇది నేను చేస్తాను.

"ఓ ఇదియెంత భయంకరమైనది" అయితే నీవిక్కడ నుండి పారిపోతావా నీవు పట్టుపడితే? ఓ దేముడా.

"నేను చిక్కనేచిక్కనుగా" ఎలిజా. నేనుముందుగా చచ్చిపోతాను. నేను స్వతంత్ర్యము పొందుతాను లేదా మృతి పొందుతాను.

"నీవు ఆత్మహత్య చేసుకోవ్వగలవా?"

అది చేసుకోవాల్సిన అవసరము లేదు. ఇహ చిక్కి పోతే వాళ్ళు ముందుగా చంపేస్తారు. కాని సదికి దక్షిణాన నన్నెప్పటికి వారునన్ను అన్వ్మరేరు.

"ఓజార్జి నాకోసమైనా నీవు జాగ్రత్తగాచేయి. తప్పు చేయవద్దు. నిన్ను వ్యథబెట్టుకోకు. ఇంకొకరిని బాధించకు. నీవు వెళ్ళకతీరదని తెలుస్తున్నది. జాగ్రత్తగావెళ్ళు. భగవంతుని సహాయముకోసము ప్రార్థనచేయి".

"సరె ఎలిజా నేను చేయబోయేది ఇది. మా యజమానివద్ద మామూలుగా పనిచేస్తూ ఉంటాను. ఈలోపలనె అన్ని సర్దుకుంటాను ఒకవారములోజులలో నేను పారిపోతాను. నాకోసము ప్రార్థనచేయి. ఎలిజా భగవంతుడు నీ ప్రార్థనను వింటాడు."

"నీవు నీరక్షణకోసము భగవంతునిని ప్రార్థించుజార్జి. ఆయనయందు నమ్మకనుంచి వెళ్ళు. నీవు తప్పుమార్గాన పడవు."

"సరి వెళ్ళివస్తాను" అని జార్జి ఎలిజాయొక్క చేతులను పట్టుకొని ఆమె ముఖములోనికి చూస్తూ అన్నాడు. వారు నిశ్శబ్దముగా నిలుచున్నారు: కళ్ళనీళ్ళు కారుస్తు చివరి మాటలు చెప్పుకున్నారు. యెప్పుడో యేమో మరల ముఖాలు చూచుకోటముగదా.

# 3

ఒక నాటి సాయంత్రము—

షెల్బీగారి ఇంటికి దగ్గరగా ఒక చిన్న చెక్క ఇల్లున్నది. రైలుపెట్టెవంటి ఆ ఇంటి ముందు చక్కని పూల తోట, మంచి ఫలవృక్షము లున్నవి. అల్లుకొన్న పొదలలో ఆ చెక్క ఇల్లు గోడలు కనిపించకుండా కప్పబడి యున్నవి.

ఆ ఇంటిలో ఆతని భార్య యగు క్లోలీ యేదో పని తొందరలో ఉన్నది. యజమాని ఇంటిలో, ముఖ్యమైన వంట మనిషి కనుక తన ఇంటికి యెప్పుడు వండిన వంటకమె తెస్తూ ఉండేది. ఆ రోజునకూడ మిగిలిన పని ఇతర పని వాళ్ళకి వదలి, తన ఇంటాయనకు వడ్డన చేయడానికి వచ్చినది. ఆమె నిప్పువద్ద కూర్చున్నది, ఆమె నల్లని ముఖము, ఆ తెల్లని తలపాగా క్రింద ప్రకాశిస్తున్నది. క్లోలీ నిప్పుమీద రొట్టె కాలుట చూచి యెంతో గర్వపడినది. ఆ జిల్లాలో ఆమెతో పోల్చతగినవారు లేరు. బాగా బలిసిన తన బుగ్గల నూపుతూ ఇతరులు తన ననుకరించి యెలా ఓడిపోయారో, ఆ కథలన్ని చెబుతుండేది.

టామ్ పిల్లలు ఆ గదిలో ఒక మూల నల్ల గ్రుడ్లు మెరుస్తూ, బుగ్గలు ప్రకాశిస్తూ ఉండగా ఓ మూలనున్న

బెంచిమీద కూర్చున్నాడు. వాళ్ళు నడవటానికి ప్రయత్నము చేస్తున్న ఓ పసిపాపతో ఆడుకుంటున్నాడు. బల్లమీద తెల్లగుడ్డ పరచి, శుభ్రమైన కప్పులు సాసర్లుంచుటచేత, అది భోజనాల వేళయని తెలుస్తున్నది. షెల్బీగారి పొలములో పనిచేయు టాము చాలా మంచి పనివాడు; ఆ బల్లవద్ద కూర్చున్నాడు. ఆతను చాల లావుగా ఉండి కండలు తిరిగిన ఆఫ్రికా జాతీయుడు, ఆతనిలో సుతీక్ష్ణమైన జ్ఞానము, సదభిప్రాయము, దయ సామరస్యములు కరడు గట్టినవి. ఆతని యందు సర్వత్ర శీవి గౌరవము కన్పిస్తున్నది. ఆతనిలో వినయము, నిరాడంబరము, నిదానము ప్రకటితమవుతున్నవి.

ఆతను బల్లమీదనున్న పలకమీద జాగ్రత్తగా దిద్దుచున్నాడు. అక్షరములు గాబోలు చూచి వ్రాస్తున్నాడు. టామునకు షెల్బీగారి పెద్దకుమారుడైన జార్జియె ఉపాధ్యాయుడు.

"క్లోయీ, నాకు ఆకలిగా ఉన్నది, ఇంకా రొట్టె కాలలేదా" అన్నాడు జార్జి.

"అయిపోవచ్చింది, అయిపోవచ్చింది", ఉడుకుతున్న పాత్రనుండి మూతదీస్తూ "బాగానే కాలింది" అన్నది క్లోయీ. కొద్ది నిమిషాలలో క్లోయీ బల్లమీద చక్కగా కాల్చిన రొట్టెను బెట్టినది. అందరు భోజనము చేసిరి.

"రండి జార్జిగారు, అన్నిటికన్న మంచిదే, మీకు తీసి దాచి ఉంచినాను" అన్నది కోలీ. చివర ఆడుకుంటున్న పిల్లలకు కొన్ని ముక్కలు తుంపి ఇచ్చి, జార్జి పుష్టుగా భోజనము చేసినారు. భోజనము అయిన తరువాత టాము జార్జి అక్కడనున్న చెక్కబల్లమీద కూర్చుండిరి. ఇంతలో కోలీ, చిన్నపిల్ల, ఆ ఇద్దరు మొగపిల్లలు భోజనము చేసిరి. వాళ్ళు ఒకరి నొకరు చూచుకొని నవ్వుకుంటూ, పిల్లతో పాటు ఆడుకొనుచుండిరి. ఇంతలో కోలీకూడ వీరితో వచ్చి చేరింది. ఆ చిన్నపిల్ల టాము కాళ్లమీదుగా మోకాళ్ళ మీదికి యెక్కి కూర్చుని టాము ముక్కు జుత్తు లాగగ అది అందరకు నవ్వు పుట్టించింది.

"చాల తెలివైనదేనే" అని ఆ పిల్లను బుజాలమీదికి యెత్తుకొనెను.

"ఇదిగో అబ్బాయిలూ" అన్నది కోలీ "పిల్లలు పోయి పడుకోండిరా. మనము ఈ రాత్రి సభచేస్తాము గనూ" జార్జిగారు, ఈ రాత్రి మీరు మా కోసము యేదైనా గ్రంథము చదవండి.

ఇంతలోనె కొన్ని కుర్చీలు తెచ్చి వేశారు. సమాజపు భక్తు లందరూ లోనికి వచ్చారు. వారందరు షెల్బీగారి క్షేత్రముపై పనిచేయువారె; ఇతర క్షేత్రములనుండి బహు కొద్ది మంది మాత్రమె వచ్చిరి. ఆ గది అంతా ఇట్టె నిండి పోయినది. సభ మొదలు పెట్టారు. అంతా ఆ పాడిన

పాటలు బాగున్నయన్నారు. పెద్ద గొంతులతో దేవుని స్తుతించుచు వారు భజన కీర్తనలను పాడిరి, ఆ స్వర్గ సుఖము లకై దేవుని స్తుతించిరి. అలా సంకీర్తనము చేస్తున్నపుడు ఈ ప్రపంచక బాధలను మాసిన బట్టలవలె వారు విడిచి పెట్టిరి. బైబిలులోనుండి ఒక భాగము జార్జి తీసి చదివెను. భగవన్నుతి చేశారు. అక్కడున్న వారందరికి టాము నాయకుడు. ఆతని ఋజు ప్రవర్తనకు నమ్మకమునకు వారందరు ఆతనిని గౌరవించేవారు. అందుచేతనే భజన చేయునపుడు గూడ ఆతని నాయకత్వమును అవలంబించిరి. బైబిలులోని వాక్యములు ఆయన ప్రార్థనలకు జీవమిచ్చేవి; ఆతని ప్రార్థ నలవల్ల అక్కడున్న వారందరు భగవంతుని సామీప్య ఆనం దమును పొందేవారు.

ఇలా ఇక్కడ ఇవి, టాము చెక్కపెట్టె ఇంటిలో ప్రార్థన జరుగుతుండగా, అక్కడ యజమాని ఇంట్లో ఒక విపరీతమైనది జరిగినది. బల్లవద్ద షెల్బిగారు, ఆ హైలీగారు పత్రాలు పట్టుకు కూర్చున్నారు. "ఆ ఇదిగో" అన్నాడా వ్యాపారి. అమ్మకపు రసీదు ఆ పత్రాలను షెల్బి అయిష్ట త్తో విధానముగా సంతకము చేసినారు.

"సరె ఇహ అంతా పరిష్కారమైనట్లే" అన్నాడు హైలీ. "ఏమిటి షెల్బి నీకేమీ సంతోషముగా ఉన్నట్లు లేదే.

మీరు టామును ఆతనికి తగిన వసతి యున్నదో లేదో తెలుసుకోకుండా అమ్మ సన్నారుగదూ అనాడు.

"సరె, మరి మీరే వాని నమ్మారు" అన్నాడు స్టాప్రే నాం చేతనైనది నేను చేస్తాను. మీకేమీ భయ మవసరవు లేదు. నేను కూడ నీగ్రోల యెడ కఠినముగా ఉండను.

ఈ సముదాయింపువల్ల షెల్బీగారికి మనసు కష్టము తోచినది. ఆ వ్యాపారి మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

# 4

ఆ రోజు రాత్రి షెల్బీ దంపతులు యేకాంతముగా తమ గదిలో మాట్లాడుకొను చున్నారు. యజమానురాలు "ఎవరండీ ఇవ్వాళ యెవరో మిమ్మల్ని చూడాలని వచ్చా రట? యేమిటి నీగ్రో వ్యాపారా? దాని కేమిగానీయండి ఆ ఎలిజా చాల ఆదుర్దాపడినది. మీరేమొ హారీని అమ్మే స్తారన్నది. ఆ అదంతా అబద్ధము లేవే, ఆయ నెప్పుడు అటువంటిది చేయడు; మా పనివాళ్ళను మేము అమ్మము లేవె" అన్నాను.

"చూడు ఎమిలీ" అన్నాడామె భర్త. నేను అలాగె అనుకున్నాను, కాని ఈ మధ్య నాకు డబ్బు నష్టమై పోయింది. ఆ హైలీగారికి చాల అప్పుపడి పోయాను. ఎలాగయినా తీరుద్దామని డబ్బు కోసము, యాతన పడ్డాను.

కాని యేదీ తగినంతగా దొరకలేదు. అందుచేత టామును హైలీ వ్యవహారము పైసలు చేయడానికి అమ్మక తప్పలేదు.

"ఏమిటి! టామును, మన నమ్మకమైన టామును, అమ్మటయా! అయ్యో! తన యావజ్జీవము మనకై ధారపోశాడె! వంద సార్లు స్వాతంత్ర్య మిస్తానని మీరు అనలేదు. అయ్యో హెంకీ? పాపము ఎలిజాకు వాడు ఒక్క కొడుకాయెనె!"

"ఎమిలీ, నీవల్లా బాధపడుతావని, నాకు తెలుసు" అన్నాడు షెల్బీ.

"అంతకష్టమొస్తె, పోనీ డబ్బియ్యక పోయారా? అయ్యో ఆ నిర్భాగ్యులను సత్క్రైస్తవునివలె, నా చేతనైన సాయము నేను చేస్తాను అన్నానె. నేనె వారికి చదువు చెప్పాను ఆదరించాను. ఒక క్రైస్తవ మాతవలె ఎలిజాను తయారుచేశాను. దానికి తన పిల్లలకు చదువు చెప్పుకో మన్నాను. వాళ్ళ ఆయురారోగ్య ఐశ్వర్యాములకై భగవంతుని ప్రార్థించమన్నాను. ఆత్మయె ప్రపంచకనుల్లో ధన ఆయురారోగ్య భాగ్యములకన్న అధికమన్నానె. ఇహా వాళ్లు నన్నెలా నమ్ముతారు! డబ్బుకోసము హెంరీని మనము ఇలా అమ్మివేస్తె" అన్నది ఆ యజమానురాలు.

"ఎమిలీ నేనేమి చేయను. నేను పిల్లిద్దరిని అమ్మకండా ఉన్నట్లయితే, మిగతా వాళ్ళందరిని అమ్మివేయవలసి

వచ్చేది. మరి అదేమంత మంచి పని అంటావా ?"
అన్నాడు.

బహు దుఃఖముతో షెల్బీ భార్య ఆతని వైపునకు తిరిగినది. "ఇదె బానిసత్వముపై భగవంతుని అభిశాపము. ఇది పాపిష్టిది బహు క్రూరమైనది, యజమానికి బానిసకు ఈ శాపము తప్పక తగులుతుంది. బానిసలను ఉంచుకోటమె మహా పాపము. ఇది తప్పు. భగవంతుని కరుణాదృష్టిలో తప్పు. మీకు ఇదిగో నా గడియారము, నగలు, అంతా తీసుకోండి. అదంతా అమ్మి అయినా, పాపము ఆ హారీని రక్షించండి.

"నేను విచారపడుతున్నాను, ఎమిలీ, కాలము మించి పోయినది. హైలీ రసీదు వ్రాసి ఇచ్చాడు, పిల్లిద్దరిని తీసుకుపోవడానికి రేపే వస్తాడు. నేను మటుకు ఆ టామ్ ముఖము చూడలేను. ఆతనికి వీడ్కోలివ్వలేను, నేను గుఱ్ఱమెక్కి ముందుగా వెళ్లిపోతాను. నేను వాళ్లు వెళ్లిపోవడము చూడలేను. నీవు ఎలిజాను దూరముగా బయటకు తీసుకుపో దానిని హారీని చూడనియ్యకు.

"లేదు లేదు—నే నిక్కడే ఉంటాను. వాళ్ళ యజమానురాలనై వాళ్ళ కొచ్చిన ఈ దుఃఖములో పాలు పంచుకొంటున్న దన్న భావము గలిస్తాను. భగవంతుడా నన్ను క్షమించు! అన్నది షెల్బీగారి భార్య.

ఎలిజా ఈ సంభాషణ జరగక పూర్వమే యజమానురాలివద్దనుండి శలవు తీసికొని తన గదిలోనికి పోయినది. ఆమె తన భయాలవల్ల మిక్కిలిగా పీడింపబడుతున్నది. ఆమె తలుపు అవతలగా నిలుచున్నది. వాళ్ళు చెప్పుకొనుచున్నదంతా విన్నది, తాను వినాల్సిన దంతా విన్నది. అక్కడ నుండి తరువాత తన చిన్న గదిలోనికి వెళ్ళినది. అక్కడ హేరీ, పసివాడు మంచి నిద్ర పోతున్నాడు. "నాయనా నిన్ను అమ్మేశారురా, కాని అమ్మ నిన్ను రక్షిస్తుంది" అన్నది ఎలిజా. ఒక కలము కాగితము తీసుకొని త్వరగా వ్రాసినది. "ప్రియమైన అమ్మగారికి, అమ్మగారు నన్ను అవిశ్వాసురాలుగా భావించవద్దు. ఈ వేళ రాత్రి మీరు చెప్పినదంతా విన్నాను నా పిల్లవాడిని రక్షించుకోటానికి నేను వెళ్ళిపోతున్నాను. మీరు నన్ను తిట్టవద్దు. మీ సహృదయాన్ని భగవంతుడు ఆశీర్వదిస్తాడు."

త్వరగా తన బట్టలన్ని మూట గట్టుకున్నది. హేరీకి నచ్చిన బొమ్మలు మూటకట్టుకొని, శాలువ కప్పుకొని, హేరీని లేపి, మాట్లాడవద్దని చెప్పినది. అది శీతాకాలము గనుక వానికి వెచ్చని ఉన్ని బట్టలు తొడిగినది. "ఊరుకో హేరి, ఒక దుర్మార్గుడు నిన్ను ఎత్తుకోపోతాడుట, అమ్మ నిన్ను రక్షిస్తుందిలే."

ఆమె తలుపు తెరచినది. నిదానముగా వరండాలోనికి వచ్చింది. దొడ్డివైపునుండి, టాము చెక్క ఇంటికి వచ్చి, అతని కిటికీ తలుపు కొట్టినది. టాము తలుపు తెరచినాడు.

భగవంతుడు నిన్ను రక్షిస్తాడు, ఎలిజా ఏమిటే ఏమి జరిగినది ?

"నేను హేలీతో పారిపోతున్నాను. అయ్యగారు అమ్మేశారు. అవును నిన్ను గూడా, టామ్ కేసే ఆ వ్యాపారివచ్చి నిన్ను గూడ తీసుకుపోతాడు."

టాము మెదలక కదలక నిలుచున్నాడు. తను విన్న దేమిటో అర్థము చేసుకోలేక.

"దేముడా కరుణించు!" అన్నది క్లోలీ "టాము చేసిన దేమి స్వామీ"

"టాము ఏమీ చేయలేదు. ఆ ఆసామికి అయ్యగారు డబ్బియ్యలేక పోయినారు. అందుకని మిమ్మల్నిద్దరిని అమ్మేశారు. కాని అమ్మగారు నిజమైన క్రైస్తవురాలు, దేవత కూడ. ఆమెను వదలిపోవాల్సి వచ్చినది. కాని నే నేమి చేస్తాను." అన్నది ఎలిజా.

"సరేలేవయ్యా" అన్నది క్లోలీ "నీవు కూడా పో, కాని దక్షిణాన మటుకు అమ్ముడు పోకండి. అక్కడ నీగ్రోలను తన్నుతూ, అన్నముపెట్టక మాడ్చి చంపేస్తున్నారు. నీ బట్టలన్ని సర్దుతాను"

టాము ఆమె వంక నిదానముగా చూచాడు. "లేదు నేను పారిపోబోవటములేదు. ఆమె కంటె, వేరే గత్యం

సరము లేదు. కాని అయ్యగారు నన్ను అమ్మివేస్తే ఇతరులైనా రక్షింపబడుతారు. నే నీ బాధను భరిస్తాను. నేను అయ్యగారి మాట యెప్పుడు తీసివేయలేదు. ఇప్పుడు తీసి వేయబోవటము లేదు. అయ్యగారి తప్పేమీ లేదు. అయ్యగారే నీవిషయంలో అంతా జాగ్రత్తగాచూస్తారు. క్లోయీ..." అన్నాడు టాము. ఆ నిద్రిస్తున్న పిల్లలనుచూచి విసుగును పడి వాళ్ళ ప్రక్కనే దుఃఖించాడు.

"ఇంకో మాట, ఇవ్వాళే మా ఆయన పారిపోతా నన్నాడు. అవకాశముంటే నేను కూడా పారిపోయానని చెప్పు. నేను కెనడా చేరడానికి ప్రయత్నిస్తాను. ఆయనకు నా ప్రేమ తెలియచెప్పు. ఆయనను ఈ జన్మలో కలుసుకోకపోతే స్వర్గములోనన్నా కలుస్తానని చెప్పు" అన్నది ఎలిజా.

ఇంకా కొన్ని చివరి మాటలు చెప్పి, టాము క్లోయీలు తన కిచ్చిన ఆశీర్వచన వాక్యములు చెవుల్లో గింగురు మంటూ ఉండగా, కన్నీళ్ళతో, ఎలిజా పిల్లవాణ్ణి చంకలో ఇరికించుకొని మొదలకుండా వెళ్ళిపోయినది.

# 5

ఆ మరునాటి ఉదయమునను, ఒక రంగుజాతి పిల్ల వాడు, షెల్బీ దంపతుల గదిలోనికి, ఫలహారమునకు పూర్వము, వేడినీరు తీసికొనివచ్చెను.

'ఆండీ' అన్నదా యజమానురాలు 'కాస్త ఎలిజాను రమ్మని చెప్పవూ!' అన్నది తనలో పాపముగదా అను కున్నది.

వెంటనే, ఆండీ వెళ్ళి ఆశ్చర్యముతో తిరిగివచ్చెను. "దేముడా, అమ్మగారు ఎలిజా అలమారంతా తెరచి ఉన్నది, ఆమె వస్త్రులు ఇటునటు పడి ఉన్నవి. చూడగా ఆమె ఇప్పుడే వెళ్ళిపోయినట్లున్నది." అన్నాడు.

షెల్బీ దంపతులు నిజము తెలుసుకోగల్గారు, ఆండీ అంటే ఆమె వెళ్ళిపోయినదన్న మాట అని అన్నాను షెల్బీ. "ఇదంతా భగవంతుని కృప" అన్నది షెల్బీసతి. "నేను అదే అనుకుంటాను" అన్నది.

షెల్బీసతి ఎలిజా హేలీలు తప్పించుకుపోయి, సుఖ పడుతారుగదా అని ఆనందించినది. కాని షెల్బీగారికిది కోపకారణ మాయెను. ఆ వ్యాపారి తనేదో ఆమె పారి

పోవటానికి సహాయపడ్డాడని అపార్థము చేసుకుంటాడనుకొని కోపగించు కున్నాడు షెల్బి.

ఆ ఇంటిలో అంతా గందరగోళముగా ఉన్నది. పని వాళ్ళందరు ఇటునటు పరుగెత్తుచు జరిగిన దానిని గూర్చి చెప్పుకుంటున్నారు. ఇంతలో ఒక డజను పిల్లగాండ్రు ఈ వార్తను హైలీకికూడ అందించారు. ఈ వార్త విని విసటముతోనే, హైలీ మహా కోపముతో షెల్బీ ఇంటికి వచ్చినాడు. షెల్బీ అది పారిపోతే నాదేమి బాధ్యతలేదు, కావాలిసివస్తే నా గుఱ్ఱాలను దీసుకొని వెతుక్కోమన్నాడు. ఈ లోపల హైలీని భోజనానికి లేవమని ఆహ్వానించినాడు. వాళ్ళు భోజనశాలలో ప్రవేశించగానే షెల్బీసతి, యేదో కుంటి సాకు చెప్పి ముఖము తప్పించినది.

పనివాళ్ళందరు ఎలిజా పారిపోయిందని, టాముకూడా పారిపోతే పోవచ్చునని విన్నారు. అందులో ఒకనల్లటి నీగ్రో అయిన శ్యాము "ఏమి! టామునకు టాము స్థానములో నిలిచి, పెద్ద పనివాడయ్యే అదృష్ట మున్నదా!" అని సంబర పడి, తనలో తానే ఆశ్చర్యపడినాడు. అయినా కాని చెడ్డ గాలికి తిరిగితే అందరికి జబ్బేకదా అనుకున్నాడు.

'యేమ్ శ్యామ్ అయ్యగారు గుఱ్ఱాలను సిద్ధము చేయమన్నారు హైలీగారితో కలిసి ఎలిజాను పట్టుకోవాలట' అని ఆండీ కేక వేసి చెప్పాడు.

శ్యాము "సరె మంచిదె, ఇప్పుడె గుఱ్ఱాలను తెస్తా నుగా" అన్నాడు.

"అవునుగాని, మళ్ళీ ఆలోచించుకో, అమ్మగారికి పట్టుకోవటము ఇష్టము లేదు" అన్నాడు ఆండీ.

'అల్లాగా' అన్నాడు శ్యాము 'అయితె నా కొది లేయ్' అని గుఱ్ఱాలను తీసికొనిరాబోయినాడు. ఆ గుఱ్ఱాల కొట్టములోనికి రెండు గుఱ్ఱాలను దౌడు మీద ఉరికించాడు. ఇంతలో దగ్గరనె ఉన్న హైలీ గుఱ్ఱము గుఱ్ఱాలదౌడు చూచి యెగిరినది.

'ఆగండె కట్టేస్తాను' అని శ్యాము గుర్రాలను కమ్చీతో చెళ్ళున కొట్టాడు. కనిపించకుండా గుఱ్ఱము వీపును నిమురుతున్నట్లే నిమిరి ఒక కోసు ఇనుపముక్కను దోపినాడు. అప్పుడే షెల్బీ భార్య శ్యామును పిలిచింది. "చూడు శ్యాము నీవు అయ్యగారి గుర్రాల విషయములో జాగ్రత్తగా ఉండాలి. వాటిని ఊరికే ఉరికించేవు సుమా?" అన్నది.

'అట్లాగేలెండి అమ్మగారు' అన్నాడు గ్రుడ్లు గిర గిరా త్రిప్పుతూ శ్యాము.

హైలీ బయటకు రాగానే టాము గుర్రాన్ని పట్టుకున్నాడు.

"అరేయ్ కుర్రాళ్లలారా" అన్నాడు హైలీ ఇక ఒక్క క్షణము వృధాకారాదు అని యెగిరి దూకున గుఱ్ఱమెక్కాడు. ఆ చిన్న కోసు ఇనుపముక్క గుఱ్ఱము శరీరములోనికి దిగబడినది. గుఱ్ఱము గాబరాలో యెగిరి దుమికినది. ఆ దొరగారిని క్రింద పడద్రోసి పరుగెత్తుకొని పోయినది. శ్యాము దాని వెంబడి పరుగెత్తెను. ఇంతలో ఆండీ ఇతర గుర్రాలను విప్పేశాడు. అవి మొదటి దాని వెంబడిబడి పారిపోయాయి. ఆ ఇంటిల్లపాది గుర్రాలవెంట పరుగెత్తుతూ అరుస్తున్నారు. హైలీ చిరాకుతో వరండాలో నిలుచున్నాడు.

... మూడు గంటలయిన తరువాత ఆ మూడు గుర్రాలను పట్టుకొని శ్యామ్ ఆండీలు తిరిగి వచ్చిరి. అవి తిరిగి తిరిగి అలసిపోయినవి. హైలీ తక్షణము బయలుదేరుదామన్నాడు. శ్యాము గుర్రాలు సేద తీర్చుకోవాలెనని అన్నాడు. ఇదంతా కిటికీ తలుపుగుండా గమనిస్తున్న షెల్బీ సతి వచ్చి హైలీని భోజనాని కుండమన్నది. వెంటనే వంట మనిషిని వడ్డించమన్నది.

శ్యాము ఆండీలు గుర్రాలను కొట్టములోనికి తీసికొని పోయిరి.

"చూశావా అమ్మగారి కేది ఇష్టమో నాకు తెలియదా. రా ఇంట్లోకి రా చూసుకోమరి. అమ్మగారు మనకు మరి మరి వడ్డిస్తారురా." అన్నాడు శ్యాము.

# 6

ఆ ఎలిజాకన్న దురదృష్టవంతురాలిని ఊహించండి, టామునెయొక్క చెక్క ఇల్లు వదలిపెట్టిన ఎలిజాను, పీడితురాలిని ఎవరైనాసరె ఊహించగలరా? హారీ నడవగలిగినవాడె, కాని ఆతల్లి భయమువల్ల వానిని తన చేతులలోనె నిద్రబుచ్చు కునేది. అంతట గాఢాంధకారము వ్యాపించినది. బయట బాగా చలిగాఉండి గడ్డకట్టుకు పోతున్నది. ఆమెకు తనమనసు లోని భయమువల్ల పిల్లవాడు బరువనిపించుటలేదు. ఆ తల్లి సగముదూరము నడిచేది, సగముదూరము పరుగులెత్తేది... పైనున్న పరమపితుడగు దేవుని "భగవంతుడా రక్షించు దేవుడా బ్రతికించు! అంటూ ప్రార్థించుకుంటూ పోతూ ఉండేది. ఆ పగటి వెలుతురు ఆమెను ఆమె పాత ఇంటి నుంచి యెన్నో మైళ్ళదూరము చేసేది. ఆజ్యోతి ఆమెకు పరిచయమైన ప్రతిప్రదేశమునుండి ఆమెను దూరముచేస్తున్నది.

జనసమర్థముగా ఉన్నచోట్ల ఇళ్ళు ఎక్కువగా ఉన్న చోట్ల హారీని దింపి నిదానముగా నడిపించేది. ఆమెకు తనను ఎవరు గమనించుట ఇష్టములేదు. మధ్యాహ్నము ఆమె చెట్లచే కప్పబడిన వాగుదగ్గర ఆగి, పిల్లడికి సంచిలోనుండి యింత అన్నము తీసిపెట్టి ఇన్ని మంచినీళ్ళు త్రాగపట్టింది. మధ్యాహ్నము తానొక క్షేత్రమువద్ద ఆగి ఇంత భోజనము కొని తిని విశ్రమించినది. ఆమె ఉద్దేశ్యమల్లా ఓహియోనదీ

ద్వారాననున్న గ్రామానికి చేరి, అక్కడనుండి ఓహియో గ్రామము చేర నుద్దేశించినది. అంతకుమించి ఆమెకు యే ఊహా లేదు, ఇక ఆ తరువాత ఆమె దైవముమీద భారము వేసినది.

ఎలిజా సూర్యాస్తమయానికి ఓ గంట పూర్వమె ఆ నది వద్దకు చేరినది. ఆమె రక్షణకు ఆనది ఒక అడ్డుగా ప్రవహిస్తున్నది. అప్పుడే వసంతకాలము ఆరంభమైనది. నదినిండా వరదనీరు, మంచుతో నింపబడి యున్నది. పెద్ద పెద్ద మంచురాళ్ళు ఎదురుగా నది ఒడ్డునే ప్రవాహము వెంబడి నేరవేయబడి యున్నవి. ఆమెను రక్షించు భూమిని చేరుటకు అడ్డుగా, ఒక భయంకర ప్రవాహము తరంగాలతో పడుతూ లేస్తూ మంచుతో నిండియున్నది. పడవను పోనీలు లేకుండా చేయు ఆ మంచురాళ్ళను చూచి ఆమె భయపడినది. ప్రక్కనున్న సత్రములో ఒక పడవ సహాయము కోసము అడిగినది.

"అయ్యో అవతలకు దాటుటకు బల్లకట్టు లేదండీ" అని ఎలిజా అడిగినది.

"నిజముగా లేనేలేదు, నదలవల్ల బల్లకట్టు పోవటము లేదన్నది. ఆ సత్రపువాని పెండ్లాము. ఆమె ఎలిజా వంకచూచి యెంతో అలిసిపోయినదని తెలుసుకున్నది. ఆమె పిల్లవాడిని ప్రక్క గదిలోనికి తీసుకుపోయి, కొంచెము విశ్రమించు అమ్మ అన్నది. ఆ గదిలోనే ఎలిజా హేరీని నిద్రపోవటానికి పక్క మీద పడుకోబెట్టినది. కాని ఆమె నిద్రపోలేక పోయినది.

ఆ కిటికీ ప్రక్కనే నిలువబడి తనను, తన రక్షణస్థానాన్ని నిషదీసిన ఆక్రోధముతో ఉరుకు పరివాహాముపై క్రోధముతో దృష్టి సారించినది.

అన్నట్లు ఈమెను వెంబడించిన వారి సంగతేమైనది? అచ్చట షెల్బీపతి భోజనము తయారైనదన్నదేగాని అంతా అపసవ్యమేయైనది. వంటచేసే కోలీ వంట త్వరగా కానీయ లేదు. పులుసు కాచిందేకాని అంతా చెయ్యిజారి పోయినది. మళ్ళీపెట్టి కాచాల్సి వచ్చినది. అందువల్లేడు దురదృష్ట వశాత్తు కడవతో నీరు తెస్తున్న కుఱ్ఱవాడు కుండతోసహా పడ్డాడు. మళ్ళీ బావికి పోవాల్సివచ్చినది. అక్కడి పనివా ళ్లందరికి ఇవాళ అమ్మగారికి పని తెమలటము ఇష్టములేదు అనే అభిప్రాయము గల్గినది. ఆలశ్యమైనందుకు హైలీ అటు నిటు ప్రచారము చేస్తున్నాడు.

షెల్బీగారు టామును తనింటికె పిలిపించారు. ఆతనితో "టామ్ నేను షెల్బీగారికి ఆయన కావాలని కావాలని కోరినప్పుడు నీ విక్కడ లేనియెడల వెయ్యి డాలర్లు ఇస్తానని వాగ్దానము చేసినాను. కాని ఈ రోజు మటుకు నీ కిష్టము వచ్చినట్లు చేయడానికి సెలవిచ్చాను" అని అన్నాడు.

టాము "అలాగేనండి అయ్యగారు అని అన్నాడు."

ఇంతలో హైలీ "అట్లాంటివేమీ నా దగ్గర సాగవు, నీ యజమాని నిన్ను నమ్మినట్లు నిన్ను నేను నమ్మను.

'అయ్యా' అన్నాడు టామ్ నిటారుగా నిలుచుండి "పెద్దమ్మగారు మిమ్మల్ని యెత్తుకోడానికి నా చేతి కిచ్చినపుడు నే నెనిమిదేళ్ళ వాడిని. అప్పుడు మీరు నూరి చిన్నోరు. అప్పుడు మిమ్మల్ని జాగ్రత్తగా చూస్తానన్నాను. ఇప్పుడు గాదు, అప్పటినుంచి మీ విషయమై యెప్పుడైనా అజాగ్రత్తగా ఉన్నానా, మరీ క్రైస్తవ మతం దీసుకున్నప్పటినుంచి యేమైనా మీ మాట తప్పానా ?"

షెల్బిగారి కంట్లో నీరు గిఱ్ఱున తిరిగినది. "నీ వెంత మంచివాడివి. ఇది నిజమో అబద్ధమో భగవంతుడే యెరుగును. ఇప్పుడు నేను సహాయము చేయాలనుకున్న ప్రపంచ మెత్తు ధనమిచ్చినా నేను కొనలేను."

"నేనే క్రైస్తవురాలనైతే నాకు డబ్బు దొరకగానే నిన్ను నేను మళ్ళి కొనుక్కుంటాను" అన్నది షెల్బిసతి.

భోజనమైన తరువాత శ్యామ్ ఆండీలు సవారికడానికి మళ్ళీ గుఱ్ఱాలు తెచ్చారు. యేమాత్రము ఆలశ్యాను చేయకుండా ఆ ఇరువురి సేవకులతో షెల్బి గుఱ్ఱాలపై, హైలీ స్వారీచేయుచూ పోయెను.

"నేను ఆ సరాసరి రోడ్డుమీద నది గట్టుకు పోతాను, నీగ్రోలంతా ఈ మార్గాన్నే పోతారు" అన్నాడు హైలీ.

'అదే సరైనది' అన్నాడు శ్యామ్. "ఆ నదికి రెండు దోవ లున్నవి—రాజమార్గము ఒకటి, డొంక మీదుగా ఒకటి. అయ్యగారు యే మార్గాన వెళ్తారు? ఎలిజా డొంకమీదుగా వెళ్ళిందేమో ఆ మార్గాన తక్కువ మంది జనం వెళ్ళుతారు."

హైలీ ఆలోచించాడు. శ్యామ్‌ను నమ్మటమా నమ్మక పోవటమా ఆతనికి పాలుపోలేదు.

"అట్లాగేనండి అయ్యగార్కి యెట్లా యేది మంచిదనితోస్తే మాకు అదే" అని శ్యాము అన్నాడు. మళ్ళ ఆలోచించిచూస్తే.

హైలీ "అది యెన్వరు వెళ్ళని మార్గాన్నే వెళ్ళి ఉంటుంది. నారు చివరకు డొంకమార్గాన్నే వెళ్ళి వెతక నిశ్చయించారు. కొన్ని మైళ్ళు వెళ్ళిన తరువాత శ్యాముకు అది మూసివేశారని గుర్తుకు వచ్చినది; కాని హైలీ వానిని నమ్మలేదు; యేమైనా సరేనని వాళ్ళు ఆ బాటదారినే వెళ్ళి నారు. ఒక గంటైన తరువాత వారు రోడ్డుచివరకు వచ్చారు ఇహా.పోనడానికి వారికి మార్గము కనిపించలేదు.

"చూడండి అయ్యగారు అప్పుడె చెప్పానుగదండి దారి బాగుండదని మూసేశారని" అన్నాడు శ్యాము.

హైలీ కోపముతో వెనుదిరిగి రాజమార్గము మీదుగా గుఱ్ఱాలను పోనిచ్చు ప్రోవబట్టించారు. పై కారణములవల్ల ఆరైతులు, ఎలిజా వచ్చి చేరిన తరువాత ఓగంట ఆలశ్యముగా ఆ ముగ్గురు

హైలీలు, ఆ గ్రామానికి వచ్చారు. ఎలిజా కిటికీవద్ద నిలుచున్నది. అప్పుడు శ్యాము ఆమెను చూచాడు. అప్పుడే ఆతనిటోపీ ఎగిరిపోగా పెద్ద అరపు. అరచి దానివెంట గాడు దీసెను. ఈ శబ్దమునకు అదరిపడి ఎలిజా ఆతనిని చూచెను. ఆమె గదిలోనె నదివైపుగా ఒకప్రక్క తలుపున్నది. ఒక్క క్షణములో తన పిల్లడిని చంకనేసుకున్నది. తలుపుగుండా పరుగెత్తి నదిలో పడినది. ఆ వ్యాపారస్థుడు ఎలిజా నదిలోనికి ఉరుకుచుండడము చూచాడు. ఒక్క అరుపు అరచి గుఱ్ఱమును దాటించి ఆండీ శ్యాములు వెనుకరాగా ఆమె వెంటబడి పరుగెత్తెను. ఎలిజా ఆనీటి జాలునకు రాగానె ఆమెవెనుకనె హైలీ ఉన్నాడు. ఆమె ఒక్కనడిన ఎగిరి చెంగున దూకి ఆ నది ప్రవాహమున బడినది. ఆ ప్రవాహముపైన మంచుగడ్డ లున్నవి. అందులో మంచుగడ్డలు వేగముగా కదలుచున్నవి. కాని ఆమె వెరచి ఆగలేదు. ఒక గడ్డమీద నుంచి ఇంకొక గడ్డమీదికి ఆమెబూట్లు చిరిగేవరకు దుమికెను. ఆమెపాదాలు కోసుకొని నెత్తురు గారెను. నెత్తురు అడుగులు ఆమెబాటను సూచించుచుండెను. ఆమెకు శక్తి భగవంతుడే ప్రసాదించెను. ఎలిజా ఓహియోనది అవతల గట్టుననున్న ఓహియోరాష్ట్రము చేరేవరకు ఆమె యేదీ గమనించలేదు. దేనినిగూర్చి ఇంక, యోచించనే లేదు. అవతల గట్టు వైపున నున్నవ్యక్తి చేయిఇచ్చి సహాయము చేసెను.

"నీ వెవరమ్మా చాల ధైర్యమైన స్త్రీవి" అన్నాడు. ఎలిజా ఆతనిని గుర్తుపట్టెను. ఆతను ఇదివరకు ఈమెకు పొరుగింటాయనయె.

"ఓ షిమ్మెర్‌గారా" అన్నది ఎలిజా "అయ్యా నన్ను రక్షించండి. ఈ పిల్లవాడిని బ్రతికించండి. వీడిని అమ్మేశారయ్యా. ఓ అదిగో ఆయనే వీడ్ని కొన్నాడు, ఆ కెంటకీతీరానున్నాడు" ఓషిమ్మెర్‌గారూ మీకు ఒక కొడుకున్నాడుగదా!

"ఆ అమ్మా నాకూ ఉన్నాడు" అన్నాడు ఆ మనిషి. నీవు ధైర్యమైనదానివి. కాని నేను నిన్నెక్కడకు తీసుకుపోగలను గనుక. సరె నీవు ఆగ్రామములో ఉన్న తెల్లవారింటికి వెళ్ళు. వారు దయగలవారె. నీవు వారిదగ్గరికి వెళ్ళు. నిన్నువాళ్ళు సరిగా చూస్తారు" అన్నాడు.

"అయ్యా భగవంతుడు మీకు మేలు చేస్తాడు" అన్నది ఎలిజా "ఈ విషయము ఎవ్వరికి చెప్పకుగదా, మాట తప్పకుగదా" అని అన్నది.

"నేనంటే ఏమనుకున్నావు అమ్మాయి" అన్నాడు ఆతడు "నేను చెప్పనులె, నీవు నీ స్వాతంత్ర్యము సంపాదించుకున్నావు. నీవు దానిని తప్పక పొందుతావు."

ఎలిజా పిల్లడిని హృదయానికి హత్తుకొని, ఆ గ్రామ మార్గాన నడిచి వెళ్ళుతున్నది.

" మండోదరిరో భూతమావేసించినది ఆమెను " అన్నాడు హైలీ "అది ఒక గండుపిల్లిలాగే దూకిందిగదరా!"

'సరె బాబు' అన్నాడు శ్యామ్ "అయ్యగారు ఆమె

బోయిన బాటనె బొమ్మనకండి—బాబూ మేమది చేయ లేము” అని శ్యాము నవ్వాడు.

“నవ్వుతావురా? నవ్వండిరా? అని హైలె శ్యాముని ఆండీలను కసిర్నాకో కొట్టాడు. వారు అరుచుకుంటూ పోయి గుఱ్ఱాల నెక్కిరి.”

“అయ్యా సాయంత్ర మైనదండి,” అన్నాడు శ్యామ్ తీక్ష్ణముగా అయ్యగారు మేముండడానికి వీలులేదు. అమ్మగారు గుఱ్ఱా లేమైనవా యని ఆందోళన చెందుతారు. మరి ఇంత రాత్రివేళ ఆలిజి బ్రిడ్జి మీాదుగా పోనటానికి ఆనేమంటారో” అని శ్యామ్ ఆండీలు దౌడుదీసిరి. పెద్ద పెద్దగా నవ్వుకుంటూం స్వారీ చేసిరి.

శ్యాము ఆండిలు ఇంటికి తిరిగివచ్చేసరికి రాత్రి పద కొండు గంటలైనది. వీళ్ళు వచ్చుటవిని షెల్బీసతి వరండా లోనికి పరుగెత్తినది. ఓ శ్యాము నీవా? ఆ వాళ్ళెక్క డున్నారు.

“లోపలికి రా ఎమిలీ” అన్నారు షెల్బీగారు” “బయట చాల చలిగా ఉన్నది. ఊరికె అనవసర ఆందోళన చెందు తావు.”

“ఏమిటి శ్యాము యేమి జరిగినదో చెప్పు” అన్నాడు షెల్బీగారు “ఎలిజా యెక్కడున్నది.”

[10]

సరే శ్యాము ఆ కథంతా చెప్పినాడు. నేను ఎలిజాను కిటికీవద్ద చూచాను. ఎందుకంటే అప్పుడే నా టోపీ యెగిరి పోయినది. ఎలిజా నా అరపులువిని మమ్మల్ని చూచినది దాపునకు పరుగెత్తి పోయినది. హైలే వెంటబడ్డా నదిలోపలికి పోయినది. నీరు పదడుగులవరకున్నది, పైనంతా మంచుగడ్డ లున్నాయి. ఎలిజా ఒక్క అరపు అరచినది, మంచు గడ్డలమీదికెక్కి దూకుతూ బాధతో అరుస్తూ ఆమె అవతల గట్టుకు వాలినది.

షెల్బీసతి ఆశ్చర్యపడుతు తెల్లమొగము వేసినది. "ఇదంతా భగవంతుని దయ, ఆమె చావలేదుగదా, పాపము ఇప్పుడది యెక్కడున్నదో గదా!" అని అన్నది ఆమె.

"అమ్మా అంతా ఆ భగవంతుడే చూస్తాడు" అన్నాడు శ్యామ్. ఇదంతా ఆ భగవంతుని వల్లగదా ఇన్ని అనర్థాలు వచ్చినవి, అందుకే నేము ఎలిజాను ముందుగానే కలుసుకోలేక పోయినాము.

ఇది విని షెల్బీగారు కోపము అభినయించిరి. కాని శ్యామ్ అతనిని బాగా అర్థము చేసుకున్నాడు.

షెల్బీసతి "సరే శ్యాము వెళ్ళి కోలీనడిగి భోజనము చేయండి. పాపము ఆకలితో నక నక లాడుచున్నట్లున్నావు" అన్నది.

శ్యాము సంతోషముతో వంట యింటిలోనికి వెళ్ళాడు.

# 7

ఆ ప్రజాప్రతినిధి అప్పుడే తన ప్రభుత్వ పర్యటననుండి తిరిగి వచ్చారు. అందమైన తన గదిలో నిప్పుదగ్గర చలి కాచుకుంటున్నారు. ఆతని భార్య తన భర్త తిరిగి వచ్చినాడన్న సంతోషముతో, టీ అందిస్తూ "చెప్పండి, రాజ్యసభలో యేమి చేస్తున్నారో? మళ్ళీ యేదో క్రొత్త న్యాయసూత్రాన్ని అమలులో పెట్టారటగా, ఆ అంటె కెంటకీ రాష్ట్రమునుండి ఈ రాష్ట్రములోనికి వచ్చే రంగు వారికి నీరు ఆహారము ఆశ్రయ మివ్వరాదన్నారటగా? యే క్రైస్తవ ప్రభుత్వమైనా ఇట్లా యెలా అంటుందో నేను నమ్మలేను."

అవును అల్లాంటిదె ఒక క్రొత్త న్యాయసూత్రము పెట్టారు. మన రాష్ట్రవాసులు, బానిసవిధాన నిర్మూలనము కావాలనేవారు, బానిసలను తప్పించుకు పోవటానికి సహాయము చేస్తున్నారట, అందుపై కెంటకీ రాష్ట్రములోనివారు చాల ఆందోళన పడుతున్నారట.

"ఆ దురదృష్టవంతులకు పాపము ఆహారము ఆశ్రయము ఇయ్యగూడదని యెలా అడ్డుపెడుతారండీ".

"కాని అల్లాచేయడమంటె న్యాయసూత్రాన్ని వ్యతిరేకించడమే!"

అప్పుడే ఒక ముసలి నీగ్రో పరిచారకుడు తలుపు త్రోసుకువచ్చి "అమ్మగారు వంటఇంటిలోనికి ఓమారు రండి" అని బట్టుగారి భార్యను పిలిచినది.

బట్టుగారిభార్య గదివదలి పోయినది; బట్టుగారు చదువు కోటానికి కూర్చున్నారు. ఒక్క క్షణములో ఆతని భార్య "జాను, జాను కాస్త లోపలికి రండి" అన్న పిలుపు వినిపించినది. అతను వంటఇంటిలోనికి పోయినాడు. అచ్చట అందమైన యువతిని చూచాడు. ఆమె దుస్తులు చిరిగి ముక్కలుపడి పోయినవి. ఆమె కాలిబూట్లు చిరిగిపోయినవి. ఆమె కాళ్ళ నుండి రక్తము గారుచున్నది. ఆమె రెండు కుర్చీల వెనుక స్పృహతప్పి పడిపోయినది. ఆ ప్రజాప్రతినిధి నోటమాటలేక ఆమెపరిస్థితిని చూచాడు. ఆతనిభార్య ముసలి పరిచారికయైన డీనా, ఆమెను బ్రతికించడానికి ప్రయత్నము చేస్తున్నారు. ఆ ముసలినీగ్రో పరిచారకుడు పిల్లడిని మోకాళ్ళమీదకు దీసుకొని వాని పాదములను వెచ్చచేయుచున్నాడు.

"అమ్మా ఆ తలుపుగుండా వచ్చినది. కాస్త చలి కాసుకుంటానండి అన్నది. అంతే లోపలకు వచ్చినది. మూర్ఛ పడిపోయినదమ్మా" అన్నదా డీనా అనే నీగ్రో పరిచారిక. ఆమె ఈ వెచ్చదనానికి ఆగలేక పోయినట్లున్నది.

ఇంతలోనే ఆ స్త్రీ కన్నులు తెరచినది. ఆమె కళ్ళలో భయము కనిపిస్తున్నది. అమాంతము లేచి కూర్చున్నది. "నాయనా హేరీ వాళ్ళు నిన్ను పట్టుకున్నారురా" అంటూ

నేడుస్తున్నది." ఆ బాలుడు వెంగున ముసలివాని దగ్గర నుండి భూమికి పరుగెత్తిపోయి తల్లిని కౌగలించుకున్నాడు.

"ఇక్కడే ఉన్నాను ఆ వాడిక్కడే ఉన్నాడు" అని ఆమె ఆందోళనతో అరచినది. ఆ బర్టుగారి భార్య వైపు చూస్తూ "ఓ అమ్మగారు వీడ్నిమటుకు వాళ్ళకు చిక్కనియ్యకండి" అని అన్నది.

ఆబర్టుగారు "ఇక్కడున్నవా రెవరూ నీ కపకారము చేయరు పాపము నీ విక్కడ సుఖముగా ఉన్నావు భయ పడకు" అని అన్నాడు.

"భగవంతుడు నీకు మేలు చేస్తాడు" అన్నది ఎలిజా, ఎలిజా కళ్ళనీళ్ళు గ్రుక్కుకొనుచు ఏడ్చినది. ఆమె కాలు పైకి పిల్లవాడెక్క ప్రయత్నిస్తున్నాడు.

ఎలిజాను స్వగృహములో ఉన్నట్లు సుఖము గలుగ చేయుటకు నిప్పుకుంపటికి దగ్గరగా పడుకోబెట్టినది, ఆ సహజ దయావతియైన బర్టుగారి భార్య. హారీని ఆమె ప్రక్కనె పక్కలో పడుకోపెట్టినది. ఎలిజా నిద్రలోకూడ ఆమె చేతితో ఆతనిని గట్టిగా పట్టుకొన్నది.

తరువాత ఆ జాన్ బర్టు దంపతులు తాము చదువుకునే గదిలోనికి పోయిరి. ఆయన పత్రిక చదువుకొను చుండెను. ఆమె కుట్టుతున్నది. వారిద్దరు మాట్లాడుకో లేదు.

కొంతకాలమైన తరువాత డీనా వచ్చిచూచి ఎలిజా మేలొక్కన్నదని చెప్పినది. ఆ బర్డు దంపతులు మరల వంట ఇంటిలోనికి వెళ్ళిరి. ఎలిజా వెచ్చని నిప్పువద్ద కూర్చున్నది. ఆమె కళ్ళలో నీరు గ్రమ్మియున్నది.

"మీ కేమీ భయములేదమ్మాయీ అన్నది" బర్డు గారిభార్య "మేము నీ స్నేహితులమె. నీ సంగతి తెలియ చెప్పు."

"ఈ రాత్రి నేను కెంటకీనుండి వచ్చాను" అన్నది ఎలిజా.

"నీవు ఎలావచ్చావు" అన్నాడు బర్డుగారు.

"నేను మంచుగడ్డల మీదుగా నదిని దాటివచ్చాను" అన్నది ఎలిజా.

"మంచుగడ్డలను దాటివచ్చావా?" అన్నారు అక్కడున్నవారంతా.

"అవును" అన్నది ఎలిజా నిదానముగా. "భగవంతుని కృపవల్ల నేను మంచును దాటివచ్చాను. మరి వారు వెనుకనుండి తరుముకు వస్తుంటే నాకు వేరు గత్యంతరము లేక అలా వచ్చాను."

ఆ ముసలి పరిచారకుడు "దేవుడోయి అయ్యగారు ఆ మంచుగడ్డలు ముక్కలై వరదలో తేలుచున్నవండి" అన్నాడు.

"అవును, నాకు తెలుసు" అన్నది ఎలిజా "అక్కడ నుండి పోవాలని ఉద్దేశించలేను. నా ప్రాణము మీదకు వచ్చేది అక్కడే ఉన్నట్లయితే, అందుచేతనే తెగించాను. నాకు భగవంతుడే సహాయము చేశాడు. ప్రతి వానికి అను భవములోకి వస్తేనేగాని, ఒకరికి భగవంతుడెంత గొప్ప సహాయము చేస్తాడో తెలియదు."

"నీవు బానిసవా" అన్నాడు బర్డుగారు.

"అవునండి నేను కెంటకీలో ఒక ఆసామి బానిసను."

"ఆయన నీపై నిర్దయగా ప్రవర్తించాడా?"

"లేదండి ఆయన చాల దయగలవాడే" అన్నది.

"పోతే నీ యజమానురాలు క్రూరురాలా"

"లేదండి నే నంటె నా యజమానురాలు ఎప్పుడూ ఎంతో దయగా ఉండేదండి."

"మరి అట్లాంటి ఇల్లు యెందుకు వదిలేశావు."

ఎలిజా బర్డుగారి భార్యవైపు చూచినది. ఉండి ఉండి హఠాత్తుగా ఆమె "అమ్మా మీరెప్పుడైనా పుత్ర శోకము అనుభవించినారా" అన్నది.

ఆ దంపతులకు ఈ ప్రశ్నకు యేమి జవాబు చెప్పాలో తోచలేదు—వారు ఈ ప్రశ్నను ఊహించనైనా ఊహించ

లేదు. అది గాక ఒక నెల రోజుల క్రితమే వారికి మిక్కిలి యిష్టుడైన చివరి కుఱ్ఱవాడు చనిపోయినాడు.

"నే ననుభవించాను" అన్నది ఆ బట్టుగారి భార్య. "కాని నీ వెందుకు అలా అడుగుతావు?" అని ప్రశ్నించినది.

"అప్పుడే మీరు గ్రహించగలరు. ఈ చిన్నవానికి పూర్వము నాకు ఇద్దరు కొడుకులు చనిపోయారు. అందుచే వీనిపైన నాకు యెంతో ప్రేమ ఆపేక్ష. నాకున్న సర్వస్వము వీడె. వీనిని అమ్మగారు—నారు అమ్మేశారు—దక్షిణాదికి ఒక వ్యాపారి ద్వారా పంపివేయ నిశ్చయించారు—పత్రాలు కూడా సంతకాలై పోయినాక—నే నిహ అక్కడుండలేక పోయినాను—నేను పారిపోయి వచ్చేశాను. వాళ్ళు నన్ను వెంబడించినారు. ఆ నదిదాక తరుముకు వచ్చారు. నేను మంచుగడ్డల మీదుగా దుమికాను. నేను యెలా బయట పడగలిగానో నాకే అర్థము అగుటలేదు."

అక్కడ వినేవాళ్ళందరిని ఈ గాథ కలచివేసినది. ప్రజాప్రతినిధియె కరగిపోయాడు. ఇహ ఇతరులమాట చెప్పే దేమిటి.

"ఓసి దురదృష్టురాలా మరి నీ వెక్కడికి పోవాలనె" అన్నది ఆ బట్టుగారి భార్య.

"కెనడాకు.—అది యెక్కడున్నదో తెలిస్తే నాకు మాత్రము అది దూరము కాలేదు" అన్నది ఎలిజా, తన సహజ వినయ దృష్టులతో ఆ బట్టుగారిని చూస్తూ.

ఆ బట్టుగారు "అది చాల దూరమున్నది; కాని మా చేతనైన సహాయము మేము చేస్తాము. చూడు సీనా ఈ రోజు ఈమెను నీ గదిలో పడుకోనివ్వు. రేపు ఉదయము ఏమి చేయాలో ఆలోచిద్దాము. అమ్మాయి భగవంతుని మీద భారము వేయి; ఆయనే నిన్ను రక్షిస్తాడు.

బట్టు దంపతులు తాము చదువుకునే గదిలోనికి వచ్చారు. వారిద్దరు ఎలిజా విషయమై దీర్ఘాలోచన చేస్తున్నారు. బట్టుసతి ఎలిజా ఉన్న పరిస్థితికి, తాను ప్రజా ప్రతినిధియైయుండి ఇరుకున బడ్డాము యేమిటా యేమిచేయాలా అని ఆలోచిస్తున్నారు.

"ఈ రాత్రి ఈమె ఇక్కడనుండి వెళ్ళిపోవాలేమో, ఆ వ్యాపారస్థుడు ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా వెనుకబడి రానే వస్తాడు. పిల్ల నా యింట చిక్కితే చాలా చిక్కు వస్తుంది. ఈ రాత్రి పిల్ల ఇక్కడనుండి వెళ్ళిపోవాలె."

"ఈ రాత్రికిరాత్రి అదెల్లా సాధ్యమండీ? అయినా యెక్కడకు పోతారు గనుక."

"సరె వీళ్ళెక్కడికిపోవాలో నాకు తెలుసులే" అన్నాడు ఆ ప్రతినిధి బూట్లలో కాళ్ళుపెట్టుతూ, ఆయన ఒకనిట్టూర్పు విడిచాడు; ఇదెక్కడో చిక్కుసమస్య వచ్చిపడినది. ఎలాగు చేయక తప్పదాయె. ఇప్పుడు నాకు సహాయము చేసేది నా పాత స్నేహితుడైన ఒక్క వాన్ ట్రెండీయె. ఆయనపొలము ఇక్కడికి ఏడుమైళ్ళ దూరమున ఎక్కడో అడవిలో ఉన్నది. వచ్చిన చిక్కల్లా అక్కడకు నేనుతప్ప మరి బండితోలను వాడెవడూ లేడు."

"ఎందుకులేదు! మన పనివాడు బాగానె తోలుతాడు" అన్నది ఆతనిభార్య.

"అవుననుకో కాని రోడ్డు మంచిదిగాదు. అక్కడ నదిని దాటాలి, నాకు తెలిసినట్లుగా తోలిన వాడికి తెలియదు. సరె బండిని సిద్ధము చేయమను, ఈ అర్ధరాత్రి ప్రయాణమై పోవాలె. అతనుగూడ నావెంటనె రావాలె. నేనెక్కడకో పరియాణమై పోతున్నట్లు ప్రయాణమై పోతుండాలి. అతడు నన్ను కొలంబసు పట్టణము దీసుకుపోయి తిరిగి వచ్చినట్లుండాలి, మళ్ళీ కాస్త సెనేటుకు పోయినప్పుడు మాత్రం కాస్త అమాయికముగా ఉండాల్సివస్తాను—సరె యేమైనాఅంతేలె" అన్నాడు.

"నీమనస్సుకన్న నీహృదయ మెంతగొప్పది జాన్" అన్నది ఆతనిభార్య.

ఆయన గదినివిడిచి వెళ్ళుతూ, మళ్ళీ అనుమానిస్తూ, వెనుతిరిగి ఇలా అన్నాడు, "మేరీ నీవేమనుకుంటావో యేమో— అక్కడ మన హెన్రీ దుస్తులున్నవి" అల్లాఅని ఆయనింకేమీ చెప్పకుండా ఆగదివదలి వెళ్ళాడు.

బర్డుగారిభార్య తనగది, ప్రక్కనున్న పడకగదిలోనికి వెళ్ళినది; అక్కడ ఒక డ్రాయరు తెరచినది; ఆమె కన్నీరు ఆదుస్తులపై పడ్డవి. తాను మిక్కిలి ఉపయోగమనుకున్న కొన్ని దుస్తులు తీసి మూటగట్టినది. తన స్వంతబట్టల పెట్టెనుండి కొన్ని ఉన్నిదుస్తులు తీసి ఎలిజాకు సరిపోవుటకు గాను కుట్టుచున్నది. ఆమె బండిచక్రాలచప్పుడు, గడియారము పన్నెండు కొట్టగా విన్నది.

"మేరీ" అన్నాడు ఆమెభర్త "నీవామెను నిద్రలేపాలె ఇప్పుడె మేము వెళ్ళిపోవాలె."

బర్డుగారిభార్య బట్టలన్ని ఒకపెట్టెలో సర్దినది. ఆమె ఆ పెట్టెను ఆబండిలో పెట్టనున్నది. ఆతరువాత ఆమె ఎలిజాను పిలుచుటకు వెళ్ళినది. త్వరలోనె ఎలిజా ఆఇంటి యజమానురాలిచ్చిన ఉన్నిదుస్తులు, శాలువ ధరించి పిల్లవానిని యెత్తుకువచ్చినది. ఆమెను బర్డుగారి భార్య త్వరగా బండిలోనికి దీసికొని వెళ్ళింది. ఎలిజా. భావసమృద్ధ నయనములతో, బర్డుగారి భార్యతో మాట్లాడ బోయినది, కాని మాట పెగలలేదు. బర్డుగారిభార్య ఆమెను ఔదార్యముతో సాగనంపెను, తలుపు వేయగనె బండి కదలిపోయినది.

అదంతా నాటుబాట. అంతా పగుళ్ళుబారి యున్నది. ఈ మధ్య కొన్నాళ్ళనుండి బాగా వర్షాలు పడ్డవి. ఆ ప్రతినిధికి ప్రయాణము కష్టతర మనిపించినది. కాని ఆయన దానిని వదలిపెట్టలేదు. చాల సేపు ప్రయాణముచేసి ఆ బండి ఒక పెద్ద ఇంటివద్ద ఆగినది. ఆ క్షేత్రపు యజమాని పేరు వాన్‌ట్రెండి అనే వారు. ఆయన్ని నిద్రలేపడము చాల కష్టమైనది. ఆయన చాల పెద్దవాడు, భారీ మనిషి మొరటు మనిషి. కాని సరళహృదయుడు. ఆయన ఒకప్పుడు కెంటకీ రాష్ట్రవాసియై, అయినా ఆయనకు బానిసలు నుంచుకొనుట అయిష్టము, ఈ బానిసవిధానము నిర్మూలనము కావాలనుకునేవాడు; అందుచేత ఆ రాష్ట్రమును వదలివేయ నిశ్చయించినాడు. తన డబ్బంతా చేర్చుకొని ఓహియో రాష్ట్రములో కొంత భూమిని కొన్నాడు. తన బానిసలకు విముక్తినిచ్చి, తన భూములమీద పనిచేయు మన్నాడు. తరువాత ఇప్పుడు ఆ గదిలో తన ఇంట్లో విశ్రాంతిగా కాలం గడుపుచున్నాడు.

"అయ్యో మరి మీరు ఒక దురదృష్టవంతురాలైన స్త్రీకి, ఆమె పిల్లడికి ఆశ్రయ మిస్తారా" అని ఆ బర్డుగారు అడిగారు.

"ఓ తప్పకుండా ఇస్తాను" అన్నాడు వాన్‌ట్రెండ్ "ఆమె కోసము యెవరైనావస్తే జవాబు చెప్పటానికి కూడ నేనున్నాను; నాకు యేడుగురు కొడుకు లున్నారు. ఒక్కొకడు ఆరడుగుల పొడవు వాళ్ళందరూ సంసిద్ధులై యున్నారు.

వాళ్ళకు యెప్పుడు ఇష్టమైతే అప్పుడు రమ్మనమను—
మాకేమీ అభ్యంతరము లేదు'' అని ఆయన నవ్వారు.

ఎలిజా తన పిల్లవాడిని దీసికొని తన క్రొత్త స్నేహి
తుల ఇంటిలోనికి నడిచి వెళ్లినది. వాన్ట్రొంపి ఆమెను
ఒక చిన్న పడకగదిలోనికి దీసికొనిపోయి దీపము వెలి
గించాడు.

"అమ్మాయీ యేమీ భయపడకు ఎవడొస్తాడో
చూసి, వాళ్ళందరికి జవాబు చెబుతాను'' చూడు, అని
సంసిద్ధపరచిన భయంకర తుపాకిని చూపెను. "సరె సుఖ
ముగా ఇహ నిద్రపో;'' అని ఆయన తలుపు వేసుకొని వెళ్ళి
పోయారు.

ప్రజాప్రతినిధియైన బర్డుగారు ఎలిజా కథంతా
ఆయనతో చెప్పారు, "చూడండి'' అన్నాడు వాన్ట్రొంపి
తెల్లవారేవరకు మీరు మీ పరివారము ఇక్కడే ఉండాలి
సుమండీ'' అని అన్నాడు.

"లేదండి, నమస్కారము, నేను అవసరముగా
వెళ్ళాల్సిన పనుంది'' అన్నాడు బర్డుగారు.

"అయితే మీకు చాల దగ్గర మార్గమును చూపి
స్తాను'' అన్నారు.

వాళ్ళిద్దరు చీకటిలో మటుమాయ మయ్యారు. అలా వారింకా కొద్ది దూరము వెళ్ళగానే ఆ ప్రతినిధి తన స్నేహితుని చేతులో పది డాలర్ల నోటు ఉంచినాడు.

"ఇది ఆమె కోసము ఇస్తున్నాను" అన్నాడు.

"ఓహో......" అని క్లెండీ అనెను.

వారు కరస్పర్శ చేసుకొని వెళ్ళిపోయిరి.



## 8

ఉదయము సూర్యకాంతి కిటికీగుండా ప్రసరించి అంకులు టాము ఇంటిలోనివారి దుఃఖపూరిత ముఖములపై ఛాయగా బడెను ఒక చిన్న బల్లమీద.

ఆతని భార్య క్లోవే ఒక తెల్లని చొక్కాను యిస్త్రీ చేస్తున్నది. నిప్పు సెగకు రెండు చొక్కాలు అలా ఆర బెట్టినది. ఆమె యిస్త్రీచేస్తున్నంతసేపు కంటి వెంట నీరు గారుచుండెను.

టాము ఆమె ప్రక్కనే కూర్చుండి, బైబిలును మోకాలుమీద పెట్టుకున్నాడు. పిల్లలింకా నిద్రపోతూనే ఉన్నారు. టాము, సదయహృదయుడైన నీగ్రో తన పిల్ల

లను ప్రేమతో పోయి చూచుకున్నాడు; ఇది ఆఖరుమాటు గదె చూడడము అన్నాడు. భార్య, కోకీ జవాబు చెప్ప లేదు ఆ ఇస్త్రీ పెట్టను ఆ పక్కనే బెట్టి, భోరున యేడ్చింది.

"ఇది నేనెలా భరించగలనూ" అన్నది. అమ్మగారు నిన్ను మళ్ళీ కొని దీసుకొస్తానన్నారు; అయ్యో ఆ దక్షి ణాదికిపోయి, యే నీగ్రో తిరిగొచ్చాడు గనుక! అక్కడే వాళ్ళను చంపివేస్తారుటగా !—

"కాని ఇక్కడున్న దేముడు, అక్కడ ఉంటాడు."

"అది సరే అనుకో" అన్నది కోకీ. కాని ఆ భగవం తుడే అనేక భయంకరమైన సంఘటనలు ఈ లోకములో చేస్తూంటాడు; ఈ నీ మాటలు నన్ను మభ్యపెట్టవు పెట్ట లేవు!

"నేనా భగవంతుని చేతులలో ఉన్నాను. వాళ్ళు నిన్నుగాని నీ పిల్లలను గాదుగదా, నన్నే అమ్ముతున్నారు గదా; అనేదే నా కానందము. పోతే ఇక్కడ మీరందరు సుఖముగా ఉండవచ్చు; ఆ దేముడే నాకు ఇంతసహాయము చేస్తాడు" అన్నాడు టాము. టాము గొంతు గీరబోయి నది. కాని ధైర్యముతోనె పలికినాడు. "భగవంతుడు మనకు చేసిన మంచినిగూర్చి యోచించి ఆయనను మరువక ఉందాము" అన్నాడు.

"ఏమిటి అలా అనుకోటముతో వచ్చే లాభము నా కేమీ తెలియదా'' అన్నది కోలీ. "అయ్యగారు నీకు అమ్మబడే స్వాతంత్ర్యాన్ని నీ కీయవలసినది. ఆయన నీకు స్వతంత్ర్య ఖరీదీయవలసినది. నీవు ఆయనకు వచ్చేదాని కన్న రెట్టింపు సంపాదించావు. నీవు పరమ విశ్వాసముతో నీ స్వంత శరీరమువలెనె రెప్పవాల్చక ఆయన కోసము పని చేశావు. ఆయనగారు పరిస్థితులిల్లావచ్చేటట్లు చేయకుండా ఉండాల్సినది. ఇది మటుకు నిజము'' అన్నది కోలీ.

"నీకు నాపై గౌరవముంటె కోలీ అట్లా అనకు, మనము కలిసిఉండే చివరి రోజె ఇది గావచ్చు. అయ్యగారిని ఇంత పసిపిల్లవాడిగా ఉన్నపుడు నాచేతిలో పెట్టారు. అందుకె సహజముగా ఆయననుగూర్చి నేను యోచిస్తాను. మనము అనుకున్నట్లే అయ్యగారు ఈ పరిస్థితులను యోచిస్తారనుకోకూడదు. అయినా ఈయన కంటె మంచి యజమాని మన కెక్కడ దొరుకుతారు. వారికి అవకాశమె ఉంటే ఇంతదాక రానిచ్చేవారేగారు. అంత మటుకు నాకు తెలుసు. సరె భగవంతునిపై భారము వేద్దాము. ఈశ్వరాజ్ఞ లేనిదే చీమైనా కుట్టదు. సర్వరక్షకుడు, సర్వజ్ఞాని ఆయ నొక్కడే'' అన్నాడు టాము.

"ఇట్లాంటి మాటలు నాకు పట్టియ్యవయ్యా మనస్థిమితపడితె మంచిదె అనుకో'' అన్నది కోలీ. ఇలా మాట్లాడితే లాభము లేదు. సరే నడిస్తాను. మళ్ళీ నీ వెక్కడ అన్నము తింటావో యేమో నాకు తెలియదు."

ఆ రోజు కోలీకి దుర్దినము గనుక యజమానురాలు కోలీని పనిలోనికి రానవసరము లేకుండా చేసినది. పాపము కోలీ తన నైపుణ్యమంతా వినియోగించి మంచి వంటకము చేసి, ఆ రోజున భర్త కిష్టమైనవన్నీ చేసిపెట్టినది.

పిల్లలు ఇంతలోకె నిద్రనుండి లేచారు. వాళ్ళు భోజనానికి తయారైనారు. 'అరే పీటరు' ఎంత బాగుందిరా అని ఓ ముక్క నోట్లో వేసుకోబోయాడు. ఆ మోసెస్. కోలీ ఇట్టె వానిని ఒక మొట్టు మొట్టినది. "అదేమిటిరా ఇదె మీ నాయన తినే చివరిరోజు గదరా."

"ఓ కోలీ"—అన్నాడు టాము నిదానముగా.

కోలీ తలను చేతులతో పట్టుకొని యేడ్చినది.

"నేనాపుకోలేక పోయినానురా! నాకేదో గాభరాగా ఉన్నదిరా! రా నాయనా" అని కోలీ కన్నీరు తుడుచుకొని పిల్లడిని మోకాళ్ళమీదకు తీసుకొని వడ్డన చేసినది.

భోజనము అయిన తరువాత, కోలీ టాముయొక్క తెల్లబట్టలు తాను ఇస్త్రీచేసిన చొక్కాలు మేజోళ్ళు జాగ్రత్తగా మడిచి ఒక చిన్నపెట్టెలో పెట్టినది. "మళ్ళీ నీకెవరు ఇవన్నీ జాగ్రత్త చేస్తారుగనుక?" అని యేడ్చినది. "నీకు జబ్బొచ్చినా, కులాసాగా ఉన్నా ఎవరు ఆర్చి దీరుస్తారురా!" అని దుఃఖ పడినది.

తల్లిదండ్రుల దుఃఖాన్ని చూచి పిల్లలుగూడ యేడవటము మొదలుపెట్టారు. టామువటుకు ఆ చిన్న పిల్లను దీసుకొని, అది తనజుట్టు పీకుతున్నా ఊరుకొని అది నవ్వేవరకు ఆడుకోనిచ్చాడు. ఇంతలో షెల్బీసతి వచ్చినది. "టామూ" అన్నదామె "నేనూ వచ్చాను..." అని ఆగి ఆచిన్న సంసారాన్ని చూచి గుడ్లనీరు గ్రుక్కుకొన్నది.

"దేవుడా, అమ్మగారూ ఎందుకండీ" అని అదివరకే యేడుస్తున్న కోలీ అన్నది. కొన్ని నిముషాలైన తరువాత అంతా వానకురిసి వెలిసినట్లయి కోపమంతా విడిపోయినది.

"ఇదిగో చూడు" అన్నది షెల్బీసతి, "ఇప్పుడేమిచ్చినా అది వాళ్ళు తీసుకుంటారు. కాని నేను భగవత్సాక్షిగా వాగ్దానమిస్తున్నాను. నాకు తగినంతడబ్బు చేతికి రాగానే నీ వెక్కడికి పోయినాసరె పోయి వెదికి నిన్ను మరల తీసుకొస్తాను. అంతవరకు భగవంతునిపై భారము వేసి భగవంతుని నమ్ముకో."

పిల్లలు అయ్యగారు వస్తున్నారని అరచారు. ఇంతలో తలుపు గట్టిగా తన్నబడినది. హైలీ లోనికి ప్రవేశించినాడు. ఎలిజాను పట్టుకోలేక పోయినానవె కోపముచేత మండిపడుతున్నాడు.

"రా, రా, నీగ్రో! నీవు సిద్ధముగా నున్నావా" అన్నాడు. షెల్బీ సతిని చూచి ఆమెకు వందనము చేసినాడు. కోలీ టాము ట్రంకుపెట్టెను మూసి వేసి కంటె

నీటి జాలుచేత తన కోపమును సూచించినది. టామ ప్రశాంతముగా నిల్చున్నాడు. పెట్టెను బుజాన వేసుకున్నాడు. తన క్రొత్త యజమానితో బండినద్దకు పోవుటకు సిద్ధపడినాడు. షెల్బీసతి ఆ చిన్న సంసారము బండినదకు చేరేవరకు హైలీతోగూడ వెంట వచ్చినది. ఇంతలో ఆ క్షేత్రముమీద పనిచేసే వారందరు పిన్న పెద్ద లందరు తమ మిత్రునకు నాయకునకు వీడ్కోలు ఇవ్వడానికి గుమిగూడారు. టామ పెద్ద పనివాడనేగాక, క్రైస్తవమత బోధకుడుగాకూడ వారి మన్నన పొందెను. అతనితో యెడబాటు వారందరికి విచారము గల్గించినది.

"కోలీ నీవె మాకన్న దుఃఖాన్ని భరించగల్గుచున్నావుగదె" అని ఊరికే యేడుస్తున్న ఒక స్త్రీ అన్నది.

"నా యేడుపు ఇరిగిపోయినదె" అన్నది ఆ వ్యాపారస్థునిచూస్తూ.. టామును చూస్తూ" ఆ మంచివాని యెదుట యేడ్చుట నాకు మనస్కరించదు.

"లోపలికిపో" అన్నాడు టామును త్వరపెడుతూ "లోపలికి పో" అన్నాడు హైలీ. రెండు జతల సంకెళ్లను హైలీ బయటకుదీసి కాళ్ళకు వేశాడు. అక్కడున్న వారికి ఇది బాధగా తోచినది, షెల్బీగారి భార్య వరండాలోనుండి "హైలీగారు అదంతా చేయాల్సిన అవసరము లేదండీ" అన్నది.

"మీకు తెలియదమ్మా నిన్ననే నేను అయిదు నందల డాలర్లు ఇక్కడికి నష్టపోయినాను. ఇంకా నేను నష్టపోలేను" అన్నాడు హైలీ.

హైలీ బండిలోనికి యెక్కి వెళ్ళి పోయినాడు. టాము బండిలో వెనుక కూర్చుండి తన కన్నులతో చూపు దాటే వరకు తన కుటుంబాన్ని చూచుకున్నాడు. టాము హైలీలు మొదలకుండా కమ్మరమువాడిల్లు వచ్చేవరకు ప్రయాణము చేశారు. అక్కడ కమ్మరము సామిని పిలిచి హైలీ ఆ సంకెళ్ళను సరిచేయించెను—ఆ సంకెళ్ళు టాముకు సరిపోలేదు.

"ఎందుకండీ ఆతడు షెల్బీగారి టామువోనా. అయితే ఈ సంకెళ్ళు వేయాల్సిన పనేలేదు. అతడు చాల నమ్మకస్తుడండీ" అన్నాడు.

"అవునవును నేనీ నీగ్రోలను నమ్మను. వాళ్ళు పారి పోకుండా ఉండడానికి సంకెళ్ళు వేయాల్సిందె. 'ఇదిగో టాము నీకు చెబుతున్నాను' అన్నాడు. హైలీ బండి పోతూండగా 'నీవు సవ్యముగా ప్రవర్తిస్తే నేను సవ్యముగానె ఉంటాను. ' నేను మటుకు నీగ్రోల యెడల క్రూరముగా ఉండేవాడినిగాదు కాని వాళ్ళె పొరపాట్లువల్ల తప్పుచేస్తే సహించేవాడిని మటుకుగాదు. తెలుసుకో."

కొంతసేపైన తరువాత హైలీ తన జేబులోని వార్తా పత్రికల దీసుకొని అందులోని వ్యాపార ప్రకటనలను చదివి

చూచాడు. అతను బాగా చదవలేక పోయినాడు, కాని చదివినది బిగ్గరగా చదివాడు. అమ్మకానికి — నీగ్రోలు ఫిబ్రవరి ఇరవైయో తేదీ మంగళవారమునాడు న్యాయ స్థానము ఎదుట ఈ క్రింది వారు అమ్మబడుదురు. హేగారు వయస్సు అరవై సంవత్సరములు, జాన్ ముప్పది ఏండ్లు, బెన్ ఇరవైయొక్క ఏళ్ళు, సాల్ పాతిక సంవత్సరములు, ఆల్బర్టు పధ్నాలుగేండ్లు — అనబడేవారు జెస్సీ బుచ్‌ఫర్డుగారి వారసులకుగాను అమ్మబడుదురు.

చూడు టామూ ఇదేదో మనము చూడాలి, నే నొక గుంపును దక్షిణాదికి తీసుకుపోవాలనుకుంటున్నాను. మనము సరాసరి వాషింగ్టనుకు పోదాము. అక్కడ నిన్ను జైలులో పెట్టి నా వ్యాపారము నేను చేసుకుంటాను అన్నాడు హైలీ.

టామూ యేమీ అనలేదు. కాని ఆ అమ్మబోయే వారిలో యెంత మందికి పిల్లా జెల్లా ఉన్నారో తనలాగే బాధపడేవాళ్ళున్నారా అని, తనలాగే యెందరు పెళ్ళాం పిల్లలను వదలిరావలసి వచ్చినదో అని ఆశ్చర్యపడ్డాడు. తాను మొదటినుండి న్యాయముగా సత్యముగా వ్యవహరించుటచేత తనను జైలులో వేయిస్తాననడము అతనికి మనస్సంకటముగా తోచినది.

ఆ మరునాడు పదకొండు గంటలప్పుడు కోర్టుద్వారము అవతల సమూహాముచేరి నిలుచున్నది. అమ్మకానికి తెచ్చిన

స్త్రీలను పురుషులను ఒక వలయాకారముగా కూర్చుండ బెట్టి అమ్మకానికి సిద్ధపరిచారు. వాళ్ళలో వాళ్లు మాట్లాడు కుంటున్నారు. ఇంతలో వేలం వేశారు. వేలంపాట పాడుట మొదలు పెట్టారు. ఆ మనుష్యులను కొద్దికాలము లోనే అమ్మివేశారు. హైలీగారు ఇద్దరు మనుష్యులను ఒక బాలుడిని కొన్నారు.

'రండి' అని హైలీ చేతులకు బేడీలు వేసి జైలులోకి త్రోశారు.

కొద్దిరోజులైన తరువాత తాను కొన్నవారితో మిసి సిపినది వాలున, పెద్ద స్టీమరులో హైలీ వారిని దక్షిణాదికి తీసుకపోతున్నాడు. ఆ పడవ ఆగినచోటల్లా ఇంకా స్త్రీ పురుష బానిసలను కొంటూ, తన గుంపును పెంపు చేసు కొంటు పోతున్నాడు.

ఆ పడవ చాల అందమైన పడవ. పడవ పైభాగ మున ప్రయాణీకులు స్వతంత్రులు బానిసలు గానివారు హాయిగా ఆ నది చల్లని పిల్లవాయువుల వీనగా, సూర్య రశ్మిలో వెచ్చగా కాలము గడుపుతున్నారు. సుందరమైన దుస్తులు వేసుకొని గౌరవనీయులుపచారులుచేస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు. వాళ్ళ పిల్లలు ఆటలాడుచు పాటలు పాడుకుంటున్నారు. కాని అదే పడవ క్రిందిభాగములో ఒక మూల ఇరుకుకొని హైలీ బానిసగుంపు కలిసి కూర్చున్నది. వారిలో గూడ పురుషులు స్త్రీలు తల్లులు

తండ్రులు భర్తలు పిల్లలున్నారు. వారికి వారి వారి సంసారా
లున్నవి.

నాకు ముప్పది అయిదేళ్ళ భార్య ఉన్నది. పాప
మేమిచేస్తుందో అన్నాడు జాను. దానికీ సంగతేమి తెలియదు
ఒక్కమారు దాని ముఖము చూడాలని ఉన్నది.

టాముకు తన గుండె పుంతపడినను. పాపము జాను
నకు సహాకారము చేద్దామనుకున్నాడు. జాను అతనిని ఓదార్చి
నాడు.

అక్కడే వారి నెత్తిపైన ఆ పడవ పై భాగమున
తండ్రులు తల్లులు భార్యలు భర్తలు చక్కగా నృత్యము
చేస్తున్న వారి పిల్లలున్నారు. వారందరు సౌఖ్యముగా
ఉన్నారు.

## 9

ఓ పరిశుభ్రమై, బాగా వెలుతురుతో నిండిన ఒక
వంట ఇల్లును ఊహించుకోండి. ఒక ప్రక్కన నల్లటి మండు
తున్న కుంపటి, దాని దాపున కుర్చీలు వేయబడి ఉన్నవి.
ఆ గదిలోనే అందముగా కుట్టుపనిచేస్తూ మనకు పరిచితురా
లైన ఎలిజా కూర్చున్నది.

ఆమె ప్రక్కనే రాఖేలు హాలిడే అను ఆమె జాగ్రత్తగా యెండిన పళ్ళను పళ్ళెములో కడుగుచున్నది.. ఆమెకు యాభై యైదు లేక అరవై సంవత్సరా లుండును. ముఖము ఆకర్షణీయముగానే ఉన్నది. తెల్లని టోపి తెల్లని కాలరు ఆమె మెడచుట్టూ ఉండి నిరాడంబరమగు ఆమె దుస్తులు ఆమె క్వాకర్లు అంటే మిత్రమండలికి చెందిన స్త్రీయని చెప్పకయే తెలుస్తున్నది.

"ఎలిజా నీవింకా కెనడాకు పోవాలనే ఉద్దేశిస్తున్నావా" అని ఆమె నిదానముగా అన్నది.

"అవునమ్మా" అని ఎలిజా నిర్దుష్టముగా అన్నది.

నేను వెళ్ళిపోవాలి, ఇంకా యిక్కడుండలేను. నీ కిష్ట మొచ్చిన కాలము ఇక్కడుండవచ్చునని తెలుసుకో అన్నది రాఖేలు.

'కృతజ్ఞురాలను' అన్నది ఎలిజా. ఆమె హెరిస్ను చూపుతూ "నాకు నిద్రపట్టటములేదు (క్రితరాత్రి) మళ్ళీ అతను నీడిని వెంబడిస్తున్నట్లు కలగన్నాను."

'అయ్యో పాపము' అన్నది ఆ రాఖేలు కళ్ళుతుడుచు కుంటూ "కాని నీవల్లా అనుకోగూడదు. ఇక్కడ ఆశ్రయము గోరివచ్చినవారెవ్వరు ఇక్కడ నుండి పోకుండా ఉండేటట్లు భగవంతుడు మాకు అనుగ్రహా మిచ్చినాడు.

మీ పిల్లవాడు అలా వెళ్ళిపోయే వారిలో మొదటివాడు కాగూడదు" అన్నది.

ఇంతలో సిమియనుహారిజే అను ఆయన బయటనుండి లోపలికి వచ్చాడు.

"గ్రామములోనుండి యేమైనా సమాచారమున్నదా నాన్నా అన్నది రాఖెలు."

"పీటరు స్టిబియన్ అన్నాడు తాను క్వాకరు మిత్రులతో ఈ రాత్రి వస్తానని అన్నాడట." సిమియన్ తలుపు దగ్గర ఉండే మాట్లాడాడు.

ఆతను "నీవు నీపేరు హేరిస్ అని చెప్పావుకదూ! అని అతడు ఎలిజాను ప్రశ్నించాడు.

రాఖెలు సిదానముగా ఆమె భర్తవైపు చూచినది.

ఎలిజా తన విషయమై యే పత్రికలోనైనా ప్రచురణ పడినదేమో అనుకొని అవునన్నది. సిమియను వరండా వద్దకువెళ్ళి 'అమ్మా' అని పిలిచాడు నిదానముగా, రాఖెలు ఆతనివద్దకు వెళ్ళినది.

"ఈ అమ్మాయి మొగుడు ఈ గ్రామములోనికి వచ్చాడు. ఈ సాయంత్రము ఇక్కడకు వస్తాడు."

"అలాగే బాబూ" అన్నది రాఖేలు. ఆమె ముఖము ఆనందముతో ప్రకాశించినది.

అన్నను అధి నిజమైనట. పీటరు ఆ గ్రామములోకి వెళ్ళాడు. ఆతను ఒక ముసలిమనిషిని ఇద్దరు పురుషులను చూచాడు. అందులో ఒకనిపేరు జార్జి హారిస్ట. ఆతని సంగతంతా విన్నాక ఆతనెవరో తెలుసుకోగలిగాను.

ఆమరునాడు ఆక్వేకర్ల గృహములో ఎంతో పండుగ నాటి కళ వచ్చినది. రాఖేలు యెంతో పొద్దుప్రొద్దునే లేచింది. ఆమె మొగపిల్లలు ఆడపిల్లలు కలిసి ఇల్లంతా శుభ్రము చేశారు, వారే వంట వండుకున్నారు. జార్జి ఎలిజా హారీలు రాగానే వారు కనివిని యెరుగని ఘనమైన స్వాగత మిచ్చిరి. వారు అదంతా కలలాగ భావించారు. వారి జీవితములో మొదటిసారిగా వారిని ఒక తెల్లవాని సరసన కూర్చుని ఫలహారగించ ఆహ్వానించారు. ఆతడు కొంత బిడియ పడినాడు. తరువాత మార్చుకున్నాడు—స్వగృహము అనే మాటకు అర్థము జార్జి ఇదివరకు ఎరుగడు, ఇప్పుడు తెలుసు కున్నాడు. ఆ దయామయుల ప్రకాశవంతమైన ముఖములపై భగవత్కృప ప్రతిబింబిస్తుంటే, ఆ అపార కృపావర్షము ఆతని విషాద విషణ్ణ హృదయములోనికి కురిసి, జార్జియందున్న విరోధభావమును కడిగివేసినది.

సిమియన్‌గారి పెద్దకుమారుడు "నాన్నా మీరు శరణాగతులకు ఆశ్రయమిచ్చినట్లు తెలిస్తే ఏమవుతుంది" అన్నాడు.

"నాకు విధించే జరిమాన ఇచ్చుకుంటాను" అన్నాడు నిదానముగా.

"కాని వాడు నిన్ను జైలులో వేస్తే."

"నీవు మీ అమ్మ ఈ ఇల్లు దిద్దుకురాలేరా" అని నవ్వుతూ సిమియన్ ప్రశ్నించాడు.

"అయ్యో మానల్ల మీకు కష్టము రానవసరము లేదు" అన్నాడు జార్జి ఉత్సాహములతో "మీరు మాకోసము బాధ పడుట నేను చూడలేను".

"జార్జి భయపడకు" అన్నాడు సిమియను "మేము శ్రమపడేది మీకోసముగాదు భగవంతునికోసము, మానవుని కోసము, ఈరోజు మీరు సుఖముగా విశ్రమించండి. సిమియన్ స్నేహము అను ఆయన వచ్చి మిమ్మల్ని ఇంకొక చోటికి తీసుకు పోతాడు.

"అటువంటప్పుడు మరి సాయంకాలము వరకు ఆగుట యెందుకు" అన్నాడు జార్జి.

ఇక్కడ పగటిపూట సురక్షితముగా ఉంటారు. ఈ గ్రామములోని వారందరు క్వాకర్ల మిత్రమండలి లోనివారె. మేమంతా కలిసి మిమ్మల్ని రక్షించుకుంటాము. రాత్రిపూట ప్రయాణమే మీకు మంచిది.

# 10

మిసిసిపి మహానదిమీద సూర్యుడుజ్జ్వలముగా ప్రకా శించుచున్నాడు. ఒక స్టీమరు పడవ దక్షిణానికి నిరాఘాట ముగా పోవుచున్నది. ఆ పడవ పైభాగము యావత్తూ వందల కొలది క్షేత్రములపై నుండివచ్చిన దూది బేలులచేత నింపబడినది. ఆ ఓడ అసంఖ్యాకులగు ప్రయాణీకులను దీసుకు పోవుచుండెను. టామ్ చాల రోజులు ఆ పడవమీదనె యున్నాడు. హైలీవంటి వానికికూడ టామ్ యెంతో నమ్మ కస్తుడనే అభిప్రాయము గల్గినది. అందుచేత అతని చేతికి బేడీలు వేయలేదు. ఆ పడవలో తిరుగుటకు ఆతనికి పూర్ణ స్వాతంత్ర్య మిచ్చారు. టామ్ ఆ నావికులకు వారి కఠిన మైన పనులలో చాలమారులు సహాయము చేశాడు. తాను చేయాల్సిన పనేమీ లేనపుడు, ఆ పడవ పైభాగమునకు యెక్కి ప్రశాంతమైన ప్రదేశమున ఆ దూది బేలులపై కూర్చునేవాడు.

ఆ ప్రయాణీకులలో న్యూ ఆర్లియన్సువాసి, యువ కుడు ధనవంతుడైన సెయింటు క్లేర్ అనే ఆయనుండెను. ఆతని వెంట ఆతని చిన్న కూతురు, ఇంకా వయస్సు మళ్ళిన ఒక చుట్టమున్నది.

టామ్ చాలా మారులు ఆ పిల్లను చూచినాడు. ఆమె చాల అందమైనది. ఆమె చాల మంచి పిల్ల. ఇంపుగా

ఉన్నది. అందుచే చూచే ప్రతివారు పిల్ల బాగుందిరా అనుకుంటారు. ఆ పిల్ల యెప్పుడు తెల్లని బట్టలు వేసుకునేది. ఆ పడవలో అటు ఇటు జ్యోతిబింబములాగే తిరిగేది. చాల రోజులు ఆ పిల్లను టామకూడ చూచాడు. నిదానముగా ఆ పిల్లను తన దగ్గరకు వచ్చేటట్లు చేసుకున్నాడు. టామకు చిన్న పిల్లల ఆటవస్తువులు చేయుట వచ్చును. అలా అవి చేసి ఆ పిల్లకు చూపించేవాడు. మొదట ఆ పిల్ల చాల సిగ్గుపడేది. తరువాత ఇట్టె ఆ పిల్ల పరిచయమైపోయినది.

"నీ పేరేమిటి అమ్మాయీ? అని టామ ఒక రోజున అడిగాడు."

"ఎవాంజిలినీ సెయింటుక్లారీ" అన్నది ఆ పిల్ల. "కాని అంతా ఈవా అంటారు నన్ను. మరి నీ పేరేమిటి?"

"నా పేరు టామ. పిల్లలంతా అంకులు టామ తిరిగి కెంటకీకి రా" అనేవారు.

"అయితే నేను కూడా అంకులు టాము అని పిలుస్తాను" అన్నది కూడా. నీ వంటు నా కిష్టము. ఎక్కడికి పోతున్నావు అంకులు టాము? అని అడిగినది.

"నాకు తెలియదు ఈవా ఎవరికో ఒకరికి నన్ను అమ్మేస్తారు. ఎవరు కొంటారో యేమో."

"అయితే మా నాన్నగారు నిన్ను కొనగలరుగా" అన్నది హఠాత్తుగా. నీవప్పుడు సుఖముగా ఉండవచ్చు ఈ రోజే నాన్నని అడుగుతా.

"మంచిది అమ్మాయిగారు" అన్నాడు టామ్.

అప్పుడే పడవ ఒక చిన్న బస్తీవద్ద ఆగి సరుకులు దించుచున్నది. టాము నావికులకు సహాయము చేయుటాని కని క్రిందకు వెళ్ళినాడు. పడవమళ్ళీ బయలుదేరు సమయానికి ఈవా ఆమె తండ్రి పడవకొసన యున్నారు. పడవ హఠాత్తుగా గదిలినది. ఈవా జారి గభాలున నీటిలో పడి పోయినది. క్రింద పనిచేస్తున్న టాము ఆ పిల్ల పైనుండి పడుట చూచాడు. ఎవరు కదలక పూర్వమే ఆతను నీటి లోనికి ఉరికాడు. ఈదుకుంటూ ఆమె వెంట బడ్డాడు. ఆమెను రెండు చేతుల యెత్తుకొని ఈదుకుంటూ పడవదరికి చేరాడు. కొన్ని నిముషాలయిన తరువాత ఆ పిల్లను సుర క్షితముగా ఆమె తండ్రివద్దకు చేర్చారు.

ఆ మరునాడు యెండ బాగా కాస్తున్నది. పడవ న్యూ ఆర్లియన్సు దాపునకు వస్తున్నది. టాము పడవ క్రింది భాగములో కూర్చున్నాడు. ఒక నవనాగరికుడు ఆ వ్యాపారి హైలీవద్దకు వస్తూ ఆతనిని ఆసక్తాతో చూచాడు. ఆ నవనాగరికుడు ఆతనితో మాట్లాడుతున్నాడు. ఇంతలోనే ఈవా తండ్రిని చేరవచ్చినది.

"నాన్నగారూ ఆయనను కొనండి" అన్నది ఈవా. "నీకు బోలెడు డబ్బుందిగా. నా కాతను కావాలి" అని అన్నది.

"అతను నీ కెందు కమ్మా చిట్టీ" అన్నాడు ఆ పిల్లను చూచి నవ్వుతూ.

"ఆతను సంతోషముగా ఉండేటట్లు చేయాలని" అన్నది.

"నేనిందుకే ఆతనిని కొన్నాను."

ఆ సెయింటు క్లేరిగారికి షెల్బీగారు టామునుగూర్చి నడవడిపత్రి ఇచ్చిరి. సెయింటుక్లేరీ హైలీగారికి కొన్ని నోట్లు తీసిఇచ్చారు. హైలీకూడ తనకు మంచి బేరము దొరికినందుకు యెంతో సంతోషించాడు. అమ్మకమై పోయినది.

'రా ఈవా' అన్నాడు సెయింటుక్లారీ. వారిద్దరు కలిసి టాము వద్దకు వెళ్ళారు. "పైకిచూడు టాము మరి నీ క్రొత్త యజమానినిగూర్చి యేమంటావు" అన్నాడు.

టాము తలయెత్తి ఆతని ముందర దయార్ద్రి ముఖమును చూచెను. "భగవంతుడు మీకు మేలు చేయుగాక" అన్నాడు.

"భగవంతుని అనుగ్రహ ముంటుందని నమ్ము తున్నాను. నీవు గుఱ్ఱాలను తోలగలవా టామ్."

"తోలగలనండి గుఱ్ఱాలను బాగా పోషించగలను" అన్నాడు టామ్.

"సరె నిన్ను నా గుఱ్ఱపుబండి తోలటానికి పెట్టు కుంటాను" అన్నాడు.

"ఇంకా నీకు చాలా తీరికగా ఉంటుందిగా" అన్నది. మా నాన్నగారికి తనకై పనిచేసేవాళ్ళని చూస్తే యెంతో దయగా!

సెయింటిక్లేరీ "ఉండి ఉండి బలేమాటన్నావే" అని నవ్వుతూ తిరిగి వెళ్ళిపోయాడు.

# 11

టామ్‌యొక్క క్రొత్త యజమాని ఇల్లు న్యూ ఆర్లి యన్సులోఉన్నది. టామ్‌యజమాని పేరుఆగస్టయిన్ సెయింట్ క్లేరీ. ఆతనితల్లి ఆతనిని బహుగారాబముగాజాగ్రత్తగా పెంచుకు వచ్చింది. తన కుమారుడు తన మాటకు ఎదురు చెప్పకుండా ఉండునట్లు పెంచుకువచ్చినది. ఆతను తల్లి చనిపోయిన తరు వాత ధనికురాలు అందమైన మేరీ అనే పిల్లను వివాహము

చేసుకునాడు. వారికి ఒక కూతురు. ఆపిల్లకు క్లేరీగారు తన తల్లి పేరైన ఏవాంజలీని అని పెట్టారు. ఆయనకు ఆ పిల్లంటె ప్రాణము. మామ్మగారివలె తెలివైన దవుతుం దనుకునె వారు.

దురదృష్టవశాత్తు ఆయన భార్యయైన మేరీ సెయింట్ క్లారీ దురాశా అసూయలుగల మనిషి. భర్త తనను ప్రేమించాలనుకునె మనిషి. ఆయనకు కూతురిపైన ఉండె మమకారమును చూచి ఈర్ష్య పొందేది. ఆమె కొంత సుస్తీ మనిషియేయైనా యెప్పుడు జబ్బని బాధపడేది, కొంత నిజము సగము తెచ్చిపెట్టుకున్నది. ఎప్పుడు యేదో ఒకటి చెబుతూనె ఉంటుంది. తనకు ఏమిచేసినా మెప్పుఉండే స్వభావముగాదు ఆమెది.

ఈవా సుస్తీపిల్ల అతి నాజూకుగా ఉండేది. తల్లి యెప్పుడు తన ఆయుష్యం తన ఆరోగ్యం తనపొట్ట తాను చూచుకునేది గనుక. ఆమెకు పిల్లదాని సంగతి గతి చూడడానికి సమయము చిక్కేదేకాదు.

ఇదంతా గమనించె సెయింట్ క్లేరీ ఈవాను దూర దేశమునకు ఆ శెలవులలో దాని మామగారింటికి న్యూ ఇంగ్లండుకు దీసుకుపోయిరి. క్లేరీగారు తిరిగి వచ్చేటప్పుడు తన చుట్టమైన ఒఫీలియా అనె ఆవిడను కాస్త మేరీపనిలో సహాకారిగా ఉండటానికి తీసుకువచ్చారు. మిస్ ఒఫీలియా చాల నమ్మకస్తురాలు, పనిపాటలు ఎరిగినది. ఇంకా చక్కటి దైవభక్తి

కూడ గలిగియున్నది. ఆమె శ్రమించి పనిచేయడానికి విరామ మెరుగక పరిశ్రమించడానికి అలవాటు పడినది. ఒఫీలియాకు తన ఇంటినుండి బయలుదేరి ఇంతదూరము వచ్చుటయె గగన ప్రయాణ ప్రయాస అయినది. అలావెళ్ళి తిరిగి వస్తున్నప్పుడె, ఈవా టాములు స్నేహితులవటము, క్లేరీగారు అతనిని హైలీ వద్ద కొనటము జరిగినది.

చివరకు ఆపడవ న్యూ ఆర్లియన్సు పట్టణము చేరినది. సెయింట్ క్లేరీ ఈవా ఒఫీలియాలతో తన సామానును తీసికొని పడవ దిగాడు. వారితోపాటుకూడ టాము వారికోసమాగిన చక్కని బండివద్దకు వెళ్ళాడు. ఆబండి వారిని ఆ వీథుల గుండ త్రిప్పితిప్పి ఒక పెద్ద సౌధమువద్ద ఆగినది. ఆ బండీ ముఖద్వారముగుండా, ఆ ఆవరణను దాటి సింహద్వారము వద్ద చేరి నిలిచినది. ఆ ఆవరణ మధ్యలో పైకి నీటిని విరజిమ్ము జలాశయముండి, ఆనీటి జాలులలో వందలకొలది రంగురంగు పూలు పూయుచుండెను. ఆఇల్లు అందమై సర్వభోగ నిలయము వలె ఉండెను. టాము అటువంటి సుందరమైన తావున ఉండగల్గినందులకు యెంతో సంతోషించినాడు.

చాల మంచి సేవకులు వచ్చి ఆ సామానుల దించ ప్రయత్నించిరి. సెయింటుక్లేరీ ఆ ఒఫీలియాను తాను కూర్చునే గదిలోనికి దీసికొని పోయెను. ఈవా తల్లిని చూడడానికి వరండాలోనికి పరుగెత్తుకొని పోయెను. మేరీ ఈజీచైరులో పడుకున్నది. కాని ఈవా తనకోసము రాగానే లేచినది.

"జాగ్రత్తేవు ఊరికే ముద్దుపెట్టుకోకు నాకు తలనొప్పి" అన్నది ఆమె.

తరువాత సెయింటుక్లేర్ లోపలకు వచ్చెను. భార్య ఆరోగ్యమునుగూర్చి పరామర్శించి ఒఫీలియాను పరిచయము చేశాడు. కొంతసేపయిన తరువాత టామును రమ్మనమని పిలిపించాడు.

"చూడు మేరీ" అన్నాడతడు. నేను నీకొక క్రొత్త సేవకుని కొన్నాను. చాల నమ్మకస్తుడు అందులో ఏమీ అనుమానము లేదు. ఇతనికి త్రాగు డలవాటులేదు. గుఱ్ఱాలను పారిపోనియ్యడు.

మేరీ టామునంక చూచినది. "అది నిజమనుకో. ఇదేమిటి ఇంత లావుగా ఉన్నాడు. ఈ గదిలో పట్టేటట్లే లేడు" అన్నది.

సెయింటుక్లేర్ వేరొక సేవకుని పిలిచి టామునకు గదిని చూపించమని ఆజ్ఞాపించెను. తాను భార్యతో మాట్లాడుటకు కూర్చున్నాడు. ఆమె కొద్దిసేపు మాట్లాడి ఇట్టె వెళ్ళిపోయినది. నాకు తల నొప్పిగా ఉన్నది కాస్త విశ్రాంతి తీసుకోవాలి అని అన్నది.

తరువాత భోజనాలవద్ద క్లేర్ మేరీతో "నీవు ఈ ఇంటి పసంతా వదిలేసి ఒఫీలియాకు వప్పగించు" అని అన్నాడు.

"నాదేముంది ఆమె చేస్తే నాకేమి ఇబ్బందిలేదు" అన్నది. తన చేతనున్న తాళంచేతులిస్తూ "ఈ బానిసలతో మాచెడ్డ ఇబ్బంది. వీళ్ళేదో ఇబ్బందులు తెస్తూనె ఉంటారు—వీళ్ళుత్త సోమరిపోతులు" అన్నది.

"నా ఉద్దేశములో ఈ బానిసలను ఉంచుకునే నీలోన గొప్ప బాధ్యత యున్నది" అన్నది ఒఫీలియా. "మీరె మీ బానిసలకు విద్యనేర్పి వాళ్ళను మానవులుగానె చూచి మీవంటివారె ననుకోవాలి. భగవంతుని దృష్టిలో మన మందరము సమానులమె."

ఒక ఆనందకరమగు నవ్వు ఈ సంభాషణను భగ్నము చేసినది. సెయింటుక్లేరీ అదేమిటో చూద్దామని తెర దీయగా వారందరు టామును చూచిరి. అతని కాళ్ళమీద ఈవా కూర్చొని అతని గుండీలో పూలుపెట్టుతూ గులాబి మాలను మెడలో వేయడము చూచారు.

నిజముగా టాము ఒక సౌఖ్యమైన గృహమునకె చేరినాడు. వారు అతనికి మంచి బట్టలిచ్చేవారు తిండి పెట్టే వారు. అతని పనికూడ కష్టమైనదిగాదు. ఈవాతో కాలక్షేపము చేయడము, తండ్రితో బండిలోగాని రోడ్డుమీద గాని పోతుంటె ఆ పిల్లను చూడడము.

ఒక ఆదివారమునాటి ఉదయము మేరీ నగలు దుస్తులు ధరించి ఈవాతోగూడ చర్చికి పోవాలని ఈవా కోసము వరండాలో యెదురు చూస్తున్నది. ఈవా పరుగెత్తుకు వచ్చినది.

"ఇంత ఆలశ్యమేమిటె ఎక్కడున్నావె పిల్లా" అన్నది మేరీ..

"ఇవాళ మామీకి తలనొప్పిట నా బంగారు సెంటు సీసా ఇచ్చిరావటానికి వెళ్ళాను."

"ఆ సెంటుసీసా నీ సొంతముటె? దానిని తీసుకుపోయి పనిచేసేవానికిస్తావే పో, పోయి తక్షణము తీసుకురా" అన్నది మేరీ.

ఈవా నిదానముగా వెనక్కు తిరిగినది.

"ఇదిగో మేరీ" అన్నాడు సెయింటుక్లేరీ. పిల్లదాని కిష్టమొచ్చినట్లు చేయనియ్యి.

"క్లేరీ ఇలా చేస్తుంటె ఇహ ఈ లోకములో అది యెలా నెగ్గుకువస్తుంది" అన్నది మేరీ.

"నాకదేమీ తెలియదులెగాని నీకన్న నాకన్న స్వర్గ సుఖానందములో బాగానె వుంటుందిలే" అని అన్నాడు క్లేరీ. ఆయన కుమార్తె యగు ఈవానంక తిరిగి అమ్మాయి నీవు నాతో ఇంట్లోనే వుంటావా."

"లేదు నాన్నా. నేను చర్చికి వెళ్తాను. దేవుడు మనల్నందరిని అక్కడకి రమ్మంటాడని ఒఫీలియా అత్త అన్నది. ఆయన మనము కోరినదల్లా ఇస్తాడాయె. దేముడు

చర్చికి రమ్మంటె మనమందరము వెళ్ళుట అది యొక గొప్ప యేమిటి ?"

"నీవు చాల మంచి పిల్లవు ఈవా" అన్నాడు క్లేరి "మీ అమ్మతో వెళ్ళి నా కోసము ప్రార్థనచేయి అమ్మాయీ !"

ఈవా తల్లితోటి, ఒఫీలియాతో కలిసి బండిలో యెక్కి వెళ్ళినది. బండి కదలిపోతుండగా తండ్రికి పోయి వస్తానని చేయి ఊపింది.

## 12

ఒక రోజు హాయిగా ఆ క్వాకర్ల గృహములో గడపిన తరువాత జార్జి ఎలిజా హేరీలు మళ్లీ ప్రయాణమై పోదామనే తొందరలో ఉన్నారు. ఎలిజాకు రాఖెలుహాలీడే పోయే దారిలో భోజనము చేయుటకు పొట్లమిచ్చినది. వారు తీసుకున్న కొద్దిసామానులతో ప్రయాణమైపోవ సిద్ధపడినారు. వీళ్ళమాటలు బయటకు కూడ వినిపిస్తున్నవి. ఇంతలో సిమియనుహాలిడే తన క్వాకరు స్నేహితుడైన ఫినియను ఫ్లెచరుతో కలిసివచ్చారు. ఆ ఫినియను ఫ్లెచరు చాలా పొడగరి బలిష్టకాయుడు.

"ఫిలియను మనకు క్రొత్త సంగతులు తెచ్చారు" అన్నాడు సిమియనుహాలిడే. "అవును అదే నేను క్రితమురాత్రి నిద్రపోవటానికి ఒక హోటలులో ఆగాను" అన్నాడు ఆఫినియను." ఆరాత్రి కొందరు మనుష్యులు మాట్లాడుకొనుట విన్నాను. వాళ్ళు క్వాకర్లనుగూర్చి మాట్లాడుతున్నారు. పారిపోయివచ్చిన బానిసలు క్వాకర్ల గ్రామాలలో ఉన్నట్లు వారికి తెలిసినదట. వాళ్ళుబహుశా మిమ్మల్నిగూర్చి ఇంకా రక్షణను పొందుచున్న ఇద్దరినిగూర్చి మాట్లాడుతున్నారని తెలుసుకున్నాను. వాళ్లు మిమ్మల్ని యెలాగయినా పట్టుకొని మళ్ళీ యజమానులవద్దకు పంపించి యేదో బహుమానము పొందాలని చూస్తున్నారు. ఇంకా ఈ రాత్రి మనము యేమార్గాన పోతున్నామో వారికి బాగా తెలుసు, కనుక వాళ్ళేలాగు మనలను వెంబడిస్తారు. మరి ఇప్పుడు మననేమి చేద్దామంటారు.

"నేనేమి చేయబోతున్నానో నాకు తెలుసు" అని జార్జి రెండు పిస్తోళ్ళను తీశాడు.

"ఆ యెందుకు అంతదాక రావ్వాలెండి" అన్నాడు సిమియను.

'చూడండి అయ్యా' అన్నాడు జార్జి. మీ కెందుకు మాకు బాట కొంచెము చూపించండి. నేనె బండి తోలుకు పోతాను. మంచివారైన మీ కపకారము చేయుట

మా కిష్టములేదు. భగవత్సహాయనే ఉంటె నేను నాపిల్లలు మా కంఠంలో ఊపిరి ఉండేవరకు పోరాడుతాము.

మధ్యాహ్న భోజనమైన తరువాత ఆ బండియెక్కి ఒక ఆసామి పొలమువద్దకేగి అక్కడున్న జిమ్ అనె వానిని, ఆతని తల్లిని బండిలో నెక్కించుకొనిరి. ఆ తరువాత ఎలిజా హెరీ వారిప్రక్కనె యెక్కిరి. చివరకు జార్జి యెక్కెను.

"సరే మిత్రులారా నే నుంటాను" అన్నాడు సిమియన్.

"మిమ్మల్ని భగవంతుడు రక్షించుగాక" అన్నారు ఆ శరణాగతు లందరు. తరువాత బండి కదలిపోయినది.

కొంతసేపు వారు మగతనిద్ర తీశారు. బండి ఆ రోడ్డు మీాద ఎగుడు దిగుడుగా నడుస్తున్నది.

కాని తెల్లవారుఘామున మూడు గంటలప్పుడు, యేదో గుఱ్ఱాలు వెంటబడి వస్తున్న చప్పుడు వినిపించినది. ఫినియస్ బండిని ఆపాడు. ఇంతలో ఒక క్వాకరు మిత్రుడు పరుగెత్తుకు వచ్చాడు.

"వాళ్ళు వస్తున్నారు. త్వరగా తోలండి—త్వరగా. ఎనిమిది మందో, తొమ్మండుగురో ఉంటారు. చాల వేగ ముగా వస్తున్నారు. ఆ మనిషి ఇలా అంటూ ఉండగా దూరమునుండి ఆ గుఱ్ఱపు డెక్కల చప్పుడు వినిపించినది.

తన చేతనయినంత వేగముగా ఫీనియస్ గుఱ్ఱాలను కమ్చీతో కొట్టి వేగముగా పోనిచ్చెను. బండీలోపల హారీని హృదయానికి హత్తుకున్నది. ఆ బండిలోని ముసలామె భగవంతుని ప్రార్థించినది. సాహసముతో జార్జి, గ్రిమీలు తమ పిస్తోళ్ళను చేతులలో బిగించి పట్టుకున్నారు. చివరకు బండి నల్ల బండరాళ్ళ గుట్టవద్ద ఆగినది.

"రండయ్యా యెక్కండి ఈ కొండరాళ్ళ గుట్టను" అన్నాడు ఫినియస్. మీకిదివరకు పరుగెత్తే అలవాటే ఉంటె ఇప్పుడే ప్రాణాలకోసమే పరుగెత్తండి."

చాతనైనంత త్వరగా వాళ్లు కొండ నెక్కారు. చివరకు ఒక సన్నని ఇరుకు చోటికి చేరిరి. ఈ సన్నని ఇరుకు సందు గుండాపోయి ఒక గజము పైచిలుకు లోతుగా పగిలిన రాతి తొఱ్ఱలోనికి ఫినియస్ వారందరిని కూర్చోపెట్టాడు. అంటె ఇప్పుడు వారు క్రిందనుండే వారికి కనపడరు.

వారివెంట తరుముకు వస్తున్న ఆ పదిమంది మనుష్యులు, ఆ కొండదాపునకు వచ్చిన తరువాత యేమి చేయాలో ఆలోచించుచున్నారు. జార్జి వారందరికి పైగా రాతిమీద కూర్చున్నాడు.

"మేమిక్కడే ఉన్నాము; కాని మాదగ్గర రక్షించుకోడానికి ఆయుధాలున్నవి. మేము చచ్చేవరకు మా స్వాతం

త్సీయముకోసము పోట్లాడుతాము" అన్నాడు జార్జి. జార్జి ఆమాట లనగానే వారిలో ఒకడు తుపాకితీసి వారిపైకి కాల్చాడు. అదృష్టవశాత్తు అది జార్జికి తగులలేదు.

జార్జి ఆరాళ్ళమీద నరిగియుండగా ఫినియస్ "నీవు కనిపించకుండా ఉండు" అని హెచ్చరిక చేశాడు. క్రింద ఉన్న వాళ్ళలో ఒకడు "నేను మటుకు పైకివెళ్ళబోవు చున్నాను. ఈ నీగ్రోనుచూచి నేనెప్పుడు భయపడేది లేదు. ఇప్పుడు భయపడబోవటము లేదు. నాతో యెవరు వస్తారో రాండి" అని అన్నాడు.

ఆ మనిషి ఇతర అనుచరులను దీసికొని ఆ ఇరుకు సందు దాపునకువచ్చాడు. ఆ మనిషి ఇంకా ముందునకు దూక ప్రయత్నించినాడు. ఫినియస్ ఆతనిని త్రోసివేయగా వాడు ముప్పది అడుగుల లోతుననున్న చెట్లలో పడినాడు.

దేముడా వారందరికి పిచ్చెత్తినది అని వారిలో ఒకడు అరిచాడు. వెంటనే వాడు వెనుదిరిగి పారిపోయాడు. ఆ దెబ్బతిన్న వానిని తీసికొని రోడ్డుమీదకు తీసుకుపోయిరి. కాని గుఱ్ఱముమీద వేసుకొనలేక పోయిరి. తరువాత ఇంకా ఇతర సహాయము కోసము వారందరు పారిపోయిరి. పాపము ఆ దెబ్బతిన్న వానిని ఆ రోడ్డుప్రక్కనే వదలివేసి పారిపోయిరి.

"ఇంకెందుకు. ఇదె అదను పిల్ళు తిరిగి రాకపూర్వమె ఇహా బండెక్కిపోతే మంచిది. నాలుగు గ్రామము చేరుదాము అప్పుడుగాని మనకు రక్షణ యుండదు.

అలా వాళ్ళు బండెక్కి వెళ్ళుతుండగా వారికి ఆదెబ్బ తిన్న వాని మూల్గులు వినిపించినవి.

"ఇక్కడ ఈయనను వదలి యెల్లా వెల్తాము గనుక" అన్నది ఎలిజా.

"అవును, అతనికి మనము సహాయము చేయాలి. ఆతనిని మనతోగూడ తీసుకుపోదాము" అన్నాడు జార్జి.

సరేనని వారు అతనిని తమ బండిలోనికి తీసికొనిరి. వారిలో ఉన్న ఒక నీగ్రో ముసలమ్మ ఆతని తలను తన తొడ మీద పెట్టుకున్నది. ఫినియస్ గుఱ్ఱాలను కమ్చీతో అదలించి బండిని వేగముగా పోనిచ్చెను.

ఒక గంటైన తరువాత వారు వేరొక క్వాకర్ల గ్రామమును చేరిరి. అక్కడనె ఒక క్షేత్రపాలుని ఇంట ఆశ్రయము పొందిరి. ఆ దెబ్బతిన్న వాడు తాను విరోధిగా భావించిన ఒక క్వాకరు స్త్రీ వల్లనె మంచి ఉపచారములను పొందాడు.

# 13

సరే మళ్ళీ మనము టామునంగతి చూద్దాము. ఆతని గది చాల పరిశుభ్రమైనది. ఆగది క్లేరీగారి గుఱ్ఱపుశాలపైన నె యున్నది. ఒకకుర్చీ ఒకబల్ల ఆబల్లపై ప్రార్థనా పుస్తకము బైబిలున్నది. టాముకు మళ్ళీ తనభార్యా పిల్లలపై మనసు మళ్ళినది—సరె ఉత్తరము వ్రాయాలను కున్నాడు. ఈవాను ఒక తెల్లకాగితము ఇవ్వమన్నాడు. మొట్టమొదట పలక మీద వ్రాయాలనుకున్నాడు, కాని సాగలేదు. ఆతను అక్ష రాలు వర్ణక్రమము చాల మరచిపోయినాడు. అతను అలా ప్రయత్నము చేస్తుండగా ఈవా వెనుకనె వచ్చి ఆతని భుజ ములపై నుండి చూచినది.

"ఓ అంకులుటాము యేమిటి చిత్రమైన బొమ్మలు గీస్తున్నావు."

"నేను మా పిల్లలకు ఇంటిదానికి వ్రాస్తున్నాను" అన్నాడు టాము మరి నేను వ్రాయలేనేమో.

"సరే నేను ప్రయత్నిస్తాను టాము. నాకు చాల అక్షరాలు తెలుసు" అన్నది ఈవా. తాను టాములు కలిసి నానాశ్రమ పడి వ్రాస్తున్నారు.

"నీపెళ్ళాం యెంత సంతోషిస్తుందో" అన్నది ఈవా మా నాన్నను యెప్పుడో ఒకప్పుడు మీఇంటికి పంపించమని అడుగుతాను అన్నది ఈవా.

అప్పుడు టాము "షెల్బీ అమ్మగారు నాకు డబ్బు పంపుతామన్నారు. చిన్నయ్యగారు జార్జిగారు నాకోసము వస్తానన్నారు. నేనెక్కడున్నానో వారికి తెలియచెబితే మాఇంటిదానికి యేడవవద్దని, నేను కులాసాగానే యున్నానని సముదాయించి చెబుతారుగదా" అని.

అప్పుడే సెయింటిక్లేరీ గొంతు బయట వినబడినది. ఆయన ఆ గదిలోనికి వచ్చారు.

"ఏమిటది" అన్నారు. ఆయన ఆ పలకనుచూస్తూ, టాము నీ ఉత్తరాలను నీవు నన్నే వ్రాయమను యే తీరిక సాయంసమయములలోనో నేనే వ్రాస్తాను. సరే అని ఆ సాయంకాలమునే ఆయన టాముకు ఉత్తరమువ్రాసి పోస్టులో వేశారు.

రెండు సంవత్సరాలవరకు సెయింటుక్లేరీ ఇంటి పరిస్థితులు మామూలుగా గడిచిపోయినవి. మిస్ ఒఫీలియా చెయ్యి దీరికలేకుండా ఇల్లు దిద్దుకుపోతున్నది. ఆమెకు, ఆమె సహాయము చేయబూనుకున్న యజమానురాలికి యెంతో వ్యత్యాసమున్నది.

టాము సుఖముగానె ఉన్నాడు. ఆతనిని మంచిగానే చూచేవారు. ఆతని దిగులల్లా తాను తన సంతానమునుండి వేరైనాననే బాధయె. అందుచే పట్టణములోని వేడిని తట్టుకొనలేక సముద్రపాంత గృహమునకు చేరిరి.

ఓ ఆదివారము సాయంత్రము టాము ఈవాలు, నీటి గట్టున గూర్చుండి సూర్యాస్తమయమును చూచుచుండిరి. ఈవా బైబిలును తెరచి మోకాలిమీద పెట్టుకొని బైబిలు నందు వర్ణింపబడిన, స్వర్గ సౌందర్యమును చదువుతున్నది. హఠాత్తుగా ఆమె ఆఅస్తమించు సూర్యమండలమును, సంధ్యా సమయమును వ్రేలితో చూపినది.

"టాము" అన్నది "ఆ పిల్ల అదిగో అదె."

"ఏమిటమ్మా ఈవా?."

నీవు చూడలేదా అదిగో ఆ సువర్ణజ్యోతి ఆకాశ ములో—ఆ అదె స్వర్గద్వారము. "నేను కొద్దిలో అక్క డకు పోతాను టాము."

"ఎక్కడకమ్మా ఈవా?"

ఆపిల్ల లేచినది, ఆమెబుగ్గలు ఎఱ్ఱబారినవి. కన్నులు మెరుస్తున్నవి. "అక్కడికే ఆ స్వర్గానికే. నేను కొద్దిలో వెళ్ళుతానుగా."

టాముయొక్క హృదయము కృంగిపోయినది. చూడు ఈవా ఈ ఆరు నెలలలో యెంతగా మార్పు చెందినదో చూడు. ఆపిల్ల పాపము త్వరగా పనుగెత్తలేదు. ఎక్కువ సేపు ఆడుకోలేదు. ఒఫీలియా ఆమెకు అనేకమందులు వేయు టము, సలహా ఇవ్వటము ఆతడు చూచాడు. ఇప్పుడుకూడ

ఆమెచేయి సలసల కాలిపోతున్నది. ఇంతలో ఒఫీలియా ఆ పిల్లను యెందుకో త్వరగా రమ్మనమని కేక వేసినది.

"ఈవా ఈవా త్వరగా రా మంచులో నీ వెక్కువసేపుండ రాదు. రామరి." కొన్ని నెలలబట్టి ఒఫీలియా, సెయింటు క్లేరి గారితో ఈవా జబ్బులో ఉన్నదని చెబుతూనే ఉన్నది. పాపము ఆపిల్ల కేదో పెద్దజబ్బు పట్టుకున్నది. కాని సెయింటు క్లేరీ ఈమెమాటను లక్ష్యపెట్టలేదు.

"కనిపించటము లేదుగనుక నాపిల్ల యెలా బాగా యెదుగుకు వస్తున్నదో అనుకునేవాడు. అయినా తనలో తానే భయపడ సాగాడు. అందువల్లనే యెక్కువ కాలము ఆపిల్లతోనే వెళ్ళబుచ్చేవాడు. ఆపిల్లను జాగ్రత్తగా జూచే వాడు. ఆపిల్ల బాగానే ఉన్నదిలే యని తనను సమర్థించు కునేవాడు.

కొంతకాలమైన తరువాత ఈవాకు ఇంకా యెక్కువగా జబ్బుచేసినది. డాక్టరును పిలిపించారు. ఇప్పుడు ఆమె తల్లి మేరీ సెయింటుక్లేర్ తన పిల్లదాని కేదో సుస్తీగా ఉన్నదని నమ్మినది. ఆమె యెప్పుడు యేదో ఉన్నది లేనిది గల్పించుకొని, తాను జబ్బు మనిషి ననుకొని, కేవలము స్వార్థచింతనచేత,—ఇంకొకరిజోలి జాలితోనన్నా చూచేదిగాదు. ఆ మేరీ క్లేరీ యెల్లప్పుడు తననుగూర్చి యోచించుకుంటూ, తనను చూచుకొని మిక్కిలిగా జాలి పడుతుండేది. తాను స్త్రీయై యున్నపుడు, తన కూతురు

జబ్బు విషయము తనే పట్టించుకోవలసినది. మిస్ ఒఫీలియా ఆ పిల్లకు యెంతో ఇదిగా ఉపచారములు చేసేవారు. కొద్ది రోజులు ఈవా బాగా కులాసాగానే తిరుగుతుండేది. కాని మళ్ళీ జబ్బుతో బాధపడేది. జబ్బుతో పక్కమీద ఉంటూనే, తన కిష్టమైన వాళ్ళకోసము యెంతో ఇదిగా కలువరించేది. కేవలము తల్లి తండ్రులపైనే కాకుండా తన కిష్టులైన పరిచారకులపైనగూడ ఆమె యెంతో ఇదైయేది.

ఆ పిల్ల తనేదో సహాయముచేసి ఆ పనివారల జీవితము ఇంత సుఖవంతము చేయాలనుకునేది.

అంకులు టామ్‌కోసము ఒక రోజున బైబిలు చదువుచు ఈవా "అంకులు టామ్ జీసను ఇతరుల కోసము ప్రాణాహుతి కావాలని యెందుకు కోరుకున్నాడో నాకు తెలుసు; ఎందుకంటె నాకు అలాగె అనిపిస్తున్నది" అన్నది.

"అదేమిటమ్మా ఈవా? నా కేమీ అర్థము కావటములేదు."

"ఆ పడవలో నిన్ను కలుసుకున్నప్పుడు నీకు గుర్తు లేదూ టామూ, యెందరెందరో పేద బానిసలు తల్లులను, భర్తలను, భార్యలను, పిల్లలను వదలివేశారు గదూ. అలాంటివి నేను చాల చూచాను. కాని నేనె ఈ ఘోరబాధను ఆపగలిగితే, నాకు చేతనైతే చావటముగూడ నాకానందమె" అన్నది ఆ పిల్ల యెంతో వేదనపడుచూ.

అప్పుడే సెయింటుక్లేరీ లోపలకు వచ్చెను. టాము, తన తండ్రితో మాట్లాడటానికి వీలుగా ఈవాను వదలి వెళ్ళి నాడు.

ఆ చిన్నది తండ్రి మోకాళ్ళమీద కూర్చొని అతని మీదకు వంగినది.

"నాయనా నీ దగ్గరదాస్తె యేమి లాభము గనుక, నేను నీతో ఇహ యెక్కువ కాలము మనలేను. మరి నేను పోతాను మళ్ళి నేనెప్పటి కెప్పటికి తిరిగిరాను" అని ఈవా యేడ్చినది.

"లేదు చిట్టీ ఈవా అదంతా ఉత్తమాట. అలా అను కోగూడదమ్మా."

"కాదు అది నిజము" అన్నది ఈవా. "ఇహ నాకు నయముగాదు నాన్నా నేను స్వర్గానికి వెళ్లుతాను. కాని నాన్న నిన్నుగాని నీ స్నేహితులనుగాని వదలి వెళ్ళ లేను. కాని ఈ లోకములో అనేకమైన కష్టాలు విషాదమైన ఘటన లెన్నో యున్నవి."

"నీ కెందు కింత కష్టము వచ్చిందమ్మా ఈవా?"

ఈ బీదప్రజలు పొందె బాధ ఈ మన సేవకులు—వాళ్ళెంతో నాతో మంచిగా ఉంటారు. వాళ్లంటె నాకు

కూడ యెంతో ఇష్టమె. వాళ్ళందరికి స్వతంత్రమిస్తె యెంత బాగుంటుంది నాన్నా!

"అమ్మా ఈవా మరి వారు మనతో పాటు సుఖముగా లేరూ."

అవుననుకో, మరి నీకేద్దైనా కష్టమొస్తె, ఇతర యజమానులు మరి వారిని బాగా చూస్తారా నీవు నన్నెప్పుడు కులాసాగానే ఉండాలని చూస్తావు ఇదంతా గొప్ప స్వార్థము గదా, ఈ బీద ప్రజలకు యెప్పుడు బాధా దుఃఖాల్లో మునిగి తేలుతూ ఉంటారుగదా. నాయనా ఈ బానిసలను స్వతంత్రులను చేయడానికి వేరే మార్గమేమీ లేదూ!

"అది చాల కష్టమైనది ఈవా. స్వతంత్రులయితే నాకు యెంతో ఇష్టమె, కాని యెలాగు చేయాలనేదే ప్రశ్న?"

"నాన్నా నేను చచ్చిపోయ్యాక, ఇతరులతో బానిసలను ఉంచుకోవద్దని చెప్తావా? నీవు అలా చేస్తావా?"

నీవు చచ్చిపోయాక! ఓ ఈవా అమ్మాయీ అలా అనబోకు ఈ ప్రపంచకముతో అన్నిటికన్న నీవంటె నాకెంతో ఇష్టము.

"నాన్నా ఈ బీద బానిసలుకూడ నీలాగె తమ పిల్లల్ని ప్రేమిస్తారు. అంకులుటామము పిల్లలంటె యెంతో ఇష్టము.

ఇతరులకుకూడ అంతే. నాన్నా నాకీబాగ్యానమియ్యవా నాన్నా. నేను పోయిన తరువాత టాముకు స్వతంత్ర మిస్తావుగదూ."

"అలాగేనమ్మా" అన్నాడు ఆ పిల్లతండ్రి. "ఈ లోకములో నీకేది కావాలంటె అదె చేస్తాను."

"నాన్నా" అన్నది ఈవా. తన జ్వరపు బుగ్గలను ఆతని గుండెమీద ఆనించి "మన రక్షకుని గృహానికి మనిద్దరముపోతే యెంత బాగుంటుంది నాన్నా అక్కడ యెంతో ప్రశాంతముగా ఉండదా."

సెయింటుక్లేరీ ఆపిల్లను గుండెకు హత్తుకొని యేమీ చెప్పలేక పోయినాడు.

"నీవు నా వెంట వస్తావా" అన్నది ఈవా నెమ్మదిగా. "నీ వెంట వస్తానమ్మా నిన్ను మరచిపోను." సెయింటుక్లేరీ తన చేతులలో ఆపిల్లను పెట్టుకు కూర్చున్నాడు. ఆయన తన తల్లిని గురుకు తెచ్చుకున్నాడు. ఆమె ఈవాకోసము చేసిన ప్రార్థనలు తలపునకు వచ్చినవి. ఆపిల్లను పడకగదికి తనచేతుల లోనె తీసుకుపోయి ఆపిల్ల నిద్రపోయినదాక పాడినాడు.

# 14

రోజులు గడిచిపోయినవి. ఈవాశక్తి చాల తక్కువైపోయినది. ఆమె పక్కలో పడుకొని, ఆ సుందర సరోవరమును, ఆ పూలను చూస్తూ, బైబిలును చేత్తో పట్టుకొని ఉండేది. ఒకరోజున ఆమె తన తల్లిమాటను విన్నది.

"మేరీ క్లేరీ యేమిటే చిన్నముండవు పూలెందుకే తోటలో కోస్తున్నావు" అన్నది.

ఆపిల్ల "ఈవా అమ్మాయిగారి కోసము కోశానండీ అన్నది." ఈవా పిలిచినది. ఆపిల్లయె టాప్సి అనే మురికి అల్లరి నీగ్రోపిల్ల, అంత గోలచేసేది ఆఇంట్లోనేలేదు. అది వెంటనే వచ్చినది.

"ఈ పూలెంత బావున్నాయే" అన్నది ఈవా. "నీవు చాల మంచిదానివి టాప్సీ; రోజూ నాకు ఇలాగే పూలు తెచ్చి ఇస్తూఉండవే" అన్నది.

"చూచావా ఆటాప్సీ మంచిగా ఉండటానికి ప్రయత్నిస్తున్నది" అన్నది ఈవా టాప్సీ గదిలోనుంచి వెళ్ళిపోగానే.

ఆరాత్రియే, ఈవా, ఆ ఒఫిలియాను తనజుత్తును కత్తిరించ మన్నది. ఎందుకంటే తన తండ్రికి ఆ అందమైన

ఉంగరాల జుత్తు అంటే యెంతో ఇష్టముగనుక. తరువాత తన ఇంటి పరిచారకు లందరిని తన గదిలోనికి రమ్మన్నది, వారం దరు పిల్ల పెద్ద లందరు వచ్చి పల్చగా పాలిపోయిఉన్న ఆ చిన్నమ్మాయి గారిని చూచి గాభరా పడ్డారు. ఈవా దిండుపై నానుకొని వారందరితో మాట్లాడినది. "నేనే మీ అందరికోసము కబురు పంపించినాను. ఎందుకంటె మీరంటే నాకెంతో ఇష్టము. కాని నేను చచ్చిపోతున్నాను. నేను జీసను నివసిస్తున్న సుందర ప్రపంచకములోనికి పోతున్నాను. మీరుగూడ క్రైస్తవులైతే జీసను మీకు సాయము చేస్తారు. మీరుగూడ భగవంతుని ప్రార్థించండి ఆయననుగూర్చి చద వండి" అని ఆపిల్ల ఆగిఆగి చెబుతూ విచారముతో ఇలా గన్నది "అవును పాపము మీరు చదవలేరు!" అని ఈవా తలను దిండుక్రిందబెట్టి వెక్కి వెక్కి యేడ్చినది. ఆమెచుట్టు నున్నవారుగూడా యెంతో వెక్కి వెక్కి యేడ్చి దుఃఖపడ్డారు.

"యెందుకు భయపడకండి" ఈవా తన కన్నీటిజాలును చిల్చుకొని వెడలె నగవుతో అన్నది "మీ అందరికోసము నేను ప్రార్థించాను. మీరు చదవలేకపోయినా జీసను మీకు సహాయము చేస్తాడనే నా నమ్మకము. ఆ యనను సహాయము చేయమని కోరండి—ఇతరుల నెవరినైనా బైబలు చదవమని చదివించుకోండి, వినండి — మనమందరము స్వర్గములో కలుద్దాము." "శాంతి" అన్నాడు టాము. "భగవంతుడు నిన్ననుగ్రహించుగాక" అన్నారు, అక్కడున్నవారందరు.

సరె మంచిది మీరందరు నాపైన దయగా ఉన్నారు, మీ కందరికి నేనేదో ఒకటి ఇయ్యాలనుకున్నాను. ఇదిగో నా ఉంగరాలజుత్తు ఒక్కొక్కరికి ఒక్కొక్క టిస్తాను. దాచుకోండి; అది చూచినపుడల్లా, నేను మిమ్మల్నెంత గానో ప్రేమించానని గుర్తుంచుకోండి, నేను స్వర్గము చేరిన తరువాత అక్కడ మిమ్మల్నందరిని చూడగోరుతాను'' అన్నది ఈవా.

ఇది యెంతో విచారకరదృశ్యమని యేడుస్తూ భగవం తుని ప్రార్థిస్తూ ప్రతి ఒక్కరు ఆ పిల్లకు సెలవ్వొలిచ్చిరి. ప్రతివారు ఈవా ఇచ్చినది తీసుకొని గదిలోనుంచి వెళ్ళిపోయి నారు. అంతా వెళ్ళిపోయినారు ఒక్క అంకులుటాము మిగిలియున్నాడు.

''ప్రియమైన అంకులుటాము ఇదిగో అందమైన వొంకెలజుత్తు నీ కోసము, నేను స్వర్గములో నిన్ను చూస్తా ననె నా నమ్మకము. ఈ భావము నా కెంతో ఆనంద మిస్తుంది'' అన్నది.

దీని తరువాత ఆ అమ్మాయి ఆరోగ్యము బాగా త్వరగా చెడిపోయినది. రాత్రిళ్ళు మిస్ ఒఫీలియా ఆమెను కాపాడేది. ఎక్కువగా అమ్మాయివద్ద అంకులుటాము ఉండేవాడు. ఆ పిల్లను పూలతోటలోనికి తీసుకుపోయి ఆ పిల్లకు నచ్చిన కీర్తనలు పాడేవారు. ఆ ఇంటిలో ఉన్న ప్రతివారు, ఆపిల్ల కేదో ఒకటి చేయాలనుకునేవారు. కేవలము

ఒక్క మేరీయె తన స్వవిషయము చూచుకోటములో మునిగి తేలి ఆ పిల్లదాని సంగతి పట్టించుకోకుండా యెక్కువగా యేమి సహాయము చేయలేకపోయినది.

ఒక రోజున ఒఫీలియా, టాము ఈవా గది బయట వరండాలో రాత్రిపూట పడుకొని ఉండుట చూచినది.

"ఆమె నీ వెందుకు నేలమీద పడుకున్నావు" అని అడిగినది.

"చూడండి నే నిక్కడే ఉండాలండి భగవంతుని నిర్ణయము యెప్పుడు యెలాగున్నదో ఆ అమ్మాయిగారు, మహాప్రస్థానము ప్రారంభించగానే అక్కడ స్వర్గద్వారాలు తెరుస్తారు. ఆ దివ్యత్వాన్ని మనము చూస్తాము. అమ్మా ఆ ఘడియ సమీపిస్తున్నదమ్మా" అని టాము అన్నాడు.

ఆ రోజు ఈవా బాగానె ఉన్నట్లనిపించినది. అర్ధ రాత్రి అయ్యేటప్పటికల్లా పరిస్థితి తారుమారైనది. మిస్ ఒఫీలియా టామును పిలిచింది.

"టాము డాక్టరువద్దకు త్వరగా వెళ్ళు" అన్నది. తరువాత సెయింట్ క్లేరీని పిలిపించినది. డాక్టరుగారు కూడ వచ్చారు. ఆయనేమిచేస్తారు గనుక యేమీ చేయలేక పోయినాడు. ఈవా అలా కళ్ళుమూసుకొని పడుకున్నది, తండ్రివచ్చి పిల్లదానిమీద వంగి "ఏమే ఈవా అమ్మా" అన్నాడు. అలా ఆ పిల్ల తన నీలాల కన్నులు విప్పింది,

ఒక్క నవ్వు నవ్వింది. మరుక్షణము ఊపిరి పీల్చటానికి యెంతో ఆయసపడింది. ఊపిరిపట్టు పట్టింది. ఆ పిల్లతండ్రి ఆ పిల్లబాధ చూడలేక వెనక్కు మళ్ళీ ఆ టాముచేయి గట్టిగా పట్టుకున్నాడు.

"ఓ టాము, ఇది నా చావుకే నచ్చిందయ్యా, ఇది యెక్కువ కాలము ఆగదు!"

"భగవద్విధి అన్నాడు టాము" "అయ్యా అంతా అయిపోయింది, అయ్యగారు చూడండి అమ్మాయిగారిని."

ఆ పిల్ల దిండ్లమీద ఆనుకొని పడుకొన్నది. ఆ ముఖముమీద ఆశ్చర్యముద్ర తాండవ మాడుచున్నది. యేదో ఆనందములో ఆ పాప నవ్వుకుంటున్నట్లున్నది. స్వర్గదృశ్యముల ఆనందముతో తిలకిస్తున్నది. ప్రేమ— ఆనందం—శాంతి అంటూ ఆ పిల్ల మృత్యువునుండి అమృత అమర జీవితానికి సాగిపోయింది.

# 15

ఆ పల్లె ప్రాంతములో అంత్యక్రియలు అని దీర్చుకొని సెయింటు క్లేరీ వంశము నురల పట్టణానికి చేరారు. సెయింటు క్లేరీ తన అంతర్గత బాధను తగ్గించుకోడానికి యెప్పుడు యేదో ఒక పనిని గల్పించుకుంటున్నాడు. బజారుకు వెల్తూ ఉండే వాడు, స్నేహితులను చూడబోయ్యేవాడు. మాట్లాడేవాడు. నవ్వుకునేవాడు. ఇదంతా తన దుఃఖాన్ని దిగమింగడానికి చేస్తున్నాడని బహు కొద్దిమందికే తెలుసు.

అతనిని యేమాత్రము అర్థము చేసుకొనని మేరీ "మా ఆయన చిత్రమైనవాడు ఈవా అంటే ఆయనకు ప్రేమే లేదు, పట్టింపే లేదు. ఆయనకన్న నేనే యెక్కువ బాధ పడు తున్నాను" అనేది.

ఈ మాటలు మేరీ ఒఫీలియాతో అంటున్నపుడు సెయింటు క్లేరీ చదువుకునే గదిలో ఉన్నాడు. కొంతసేపైన తరువాత టాము నిదానముగా ప్రవేశించెను. సెయింటు క్లేరీ కుర్చీలో కూర్చొని ఈవా బైబిలును చేతబట్టుకొనెను. టాము గదిలోనికి వచ్చినపుడు, ఆతని యజమాని ఆతనినంక బాధ తోను, దుఃఖముతోను చూచెను. ఆయన తన చేయిని టాముమీద పెట్టి తల వాల్చెను.

"ఓ టాము ఈలోకము స్వర్గ్యముగా గన్పిస్తున్నది."

"నాకు తెలుసయ్యా నేనెరుగుదును" అన్నాడు టాము. జీససు సాయముగోరి శరణుజొచ్చితే అయ్యగారు—ఆ దేవుని నద్దనే ఈవా ఉన్నట్లు చూస్తారు.

"టాము నేను పైకి చూస్తూనే ఉన్నాను. కాని నాకేమీ త్రోవ గన్పించటము లేదు. నాకుకూడా బైబిలును నమ్ముకుందామని ఉన్నది. కాని మనస్సు కుదుటపడటము లేదు. "టాము జీససున్నాడని నీకెలా తెలుసు, నీవెప్పుడును చూడలేదు గదా!"

"అయ్యా నా ఆత్మలో ఆయనను చూస్తున్నానయ్యా. ఆయన సాన్నిధ్యాన ఉన్నటుల నేను భావిస్తున్నాను. నా ఇంటి దానినుండి నేను వేరుచేయబడినప్పుడు నా బ్రతుకు ముక్కలై పోయినది. నాకు మిగిలేది యేదీ లేదనుకున్నాను. అప్పుడు భగవంతుడే "టాము భయపడకు టాము" అన్నాడు. ఆయనయె నా చీకటింట దీపముబెట్టి ఆనందమిచ్చి ప్రశాంతి గలుగ చేశాడు. ఆయనవల్లనే నాకెంతో సుఖముగా ఉంటుంది. ఆయన దయవల్లనే నేనందరిని ప్రేమించగల్గుతున్నాను. ఆయన అనుగ్రహముంటే నేనేమి చేయటానికైనా సిద్ధపడుతాను. ఆయనకోరిక దీర్చటానికన్న నాకేదీ పట్టదు. విజ్ఞానాతీతమైనది క్రీస్తుదేవుని కృప ప్రేమలే" అని టాము ఇదంతా యెంతో అనుభూతితో చెప్పినటుల చెప్పాడు.

"ఎంత విచిత్రము" అన్నాడు క్లేరీ. పద్దెనిమిది వందల సంవత్సరాల క్రితము జీవించిపోయిన వ్యక్తి జీవితము ప్రజలకు

ఈనాటికి అది ఇంత అర్థవంతమైన కథయా! కాని ఆయన మానవుడేగాదు. ఓ నేను మాఅమ్మ బోధనలు బోధించినవి నమ్మగలిగితే యెంత బాగుండేది.

అయ్యా మీరు నాకు ఈవా వలెనే బైబిలు చదివి వినిపించుతారా.

సెయింటుక్లేరీ బైబిలు చదివేవాడు. టాము వినేవాడు. అప్పుడు ఆతని ముఖము భక్తితోను నమ్మకముతోను మెరసిపోయేది.

ఆ పారాయణ పూర్తికాగానే "నీవు ప్రార్థనచేయి. నాకు చేయుట నేర్పు అని సెయింట్‌క్లేరీ టామును అడిగేవాడు.

టాము పూర్ణ హృదయముతో ప్రార్థించేవాడు. సెయింటుక్లేరికి అనేక అనుమానాలున్న సెయింటుక్లేరీ ప్రార్థనాబలమువల్ల ఈవా సన్నిధిని ఉన్నట్లె భావించేవాడు.

"సరేటాము మళ్లీ ఇంకొకమారు కలుసుకుందాము" అన్నాడు క్లేరీ. వారాలు గడిచిపోవుచున్నవి. ఈవా లేని బ్రతుకు క్లేరీకి శూన్యముగా ఉన్నది. క్లేరీ మత భక్తి గలవాడుగాదు. కాని బైబిలును చాలమారులు చదివాడు. ఆయన తన సేవకులనుగూర్చి వారి యెడల తన ధర్మాన్ని గూర్చి యోచించాడు. ఆయనకు టామునకు గల స్నేహ బంధము గాఢమైనది. ఇప్పుడు టామును న్యాయశాస్త్ర

రీత్యా బానిసత్వ విముక్తి గావించి స్వాతంత్ర్య మియ్యటానికి ప్రథమ ప్రయత్నాలు చేస్తున్నాడు చివరకు టామ్‌తో "టామ్ నిన్ను నేను స్వతంత్రునిచేయ నిశ్చయించుకున్నాను. నీ పెట్టె బేడ సామానులు సర్దుకొని మీ కెంటకీ వెళ్ళిపోవ టానికి సిద్ధపడు" అన్నాడు.

టామ్ ముఖము ఆనందముతో వికసించినది.

అయితే టామ్ ఇక్కడ నీకు సౌఖ్యముగానేయున్నది గదా !

అవునయ్యగారు, కాని స్వతంత్రుడగుట అంటె అది వేరుగదండి. నాకు చవకబారు దుస్తులుండవచ్చు, బీదకొంపె ఉండవచ్చు, జీవితమంతా పేదగానె గడుపవచ్చు. కాని యెంతైనా అది ఇతరులు ఇచ్చె గొప్ప దుస్తులవంటివిగాదు, అవి మళ్ళీ ఆ ఇచ్చిన వారికె చెల్లుతవి. ఇదే నా బుద్ధికి సహజముగా గోచరించె భేదము అయ్యా! అన్నాడు టామ్.

ఆ సాయంత్రము సెయింటుక్లేర్ తన భార్యతోను ఒఫీలియాతోను కూర్చొని మాట్లాడుతున్నాడు. ఆ ఒఫీలియా మాటల సందర్భాన "సరె అంతా యేర్పాటు చేస్తున్నప్పుడు మరి నీ పనివాళ్ళ సంగతేమిగావాలె, కర్మవశాత్తు నీ మృతి సంభవిస్తె" అన్నది. అప్పుడు సెయింటుక్లేర్ "నేను టాప్సీని నీకిచ్చాను. ఇతరుల విషయమైకూడ కొద్దిలోనె యేదో యేర్పాటు చేస్తాను" అన్నాడు.

తరువాత ఆ సాయంత్రమే మామూలుగానే షికారుకు వెళ్ళాడు. అయ్యగారితో వెళ్ళవలసిన పనిలేనందువల్ల టాము 'వరండాలోనే కూర్చున్నాడు. యజమాని రాకకు ఎదురుచూస్తున్నాడు. చీకటి పడినది. టాముకు మగత నిద్దర పట్టినది. యేదో తలుపు తట్టుచున్నట్లు, మనుష్యుల అరపులు అతనిని మేల్కొలిపినవి. చూడగానే అనేక మంది మనుష్యులు యజమానిని మోసుకొస్తున్నారు.

నాన్సి ఆ కథంతా చెప్పినారు. సెయింటుక్లేరీ ఒక హోటలులోనికి వెళ్ళారు. ఇద్దరు మనుష్యులు పోట్లాడుకోటానికి సిద్ధమైనారు. ఇంతలో సెయింటుక్లేరి వారిని విడదీయబోయినాడు. అందులో పొరపాటున ఆయనను కత్తితో డొక్కలో గుచ్చారు. పనివాళ్ళంతా ఆయనను ఇంటికి దీసుకువస్తుంటె మహావిచారముతో గుమిగూడారు. మేరీ మూర్ఛయే పడిపోయినది. చివరకు ఒఫీలియా టాములు ఆయనకు చేయవలసిన ఉపచారములు చేశారు. డాక్టరుగారు ఆయనను పరీక్షించిచూచి ఇక లాభము లేదని చెప్పారు. టాము ప్రక్కనే ముంగాళ్ళమీద నిలుచున్నాడు. సెయింటుక్లేరీ ఆతని చేతిని గట్టిగా పట్టుకున్నాడు.

"నేను చచ్చిపోతున్నాను టాము" అన్నాడు. టాము హృదయపూర్వకముగా తన యజమానికి భగవంతుని సన్నిధిని సుఖము గల్గుటకై ప్రార్థించినాడు. టాము ప్రార్థన కాగానే సెయింటుక్లేరీ గోడమీదనున్న తల్లి చిత్రమును

చూచి ఆమె చిన్నపుడు తనకు నేర్పిన భక్తి గేయాన్ని పాడారు.

డాక్టరు "ఆతని మనస్సు చలిస్తున్నది" అన్నాడు. క్లేరిగారు "లేదు అది స్వర్గ ధామమును చేరుచున్నది అన్నాడు. ఆయన వెనుకకు విరుచుకపడి కన్నులు మూసు కొనెను. అలా కొన్ని నిముషాలు పడుకున్నాడు. శాంతి ఆనందము ఆతని ముఖమున తాండవించెను.

"అమ్మా" అన్నాడు, అతను ఆనందముతో చిరు నగవు నవ్వుతూ. తరువాత ప్రాణము పోయినది. జీవుడు సమైక్యత చెందెను.

# 16

సెయింటు క్లేరీ చచ్చిపోయాడు. ఆయన ఇల్లంతా భయాందోళనలలో పడిపోయినది. పరిచారకు లందరికి అయ్యగారే తమ సుఖానందనముల గమనించేవాని యెరుగు దురు. ఇప్పుడు వారందరు ఒక స్వార్థపరురాలు మూర్ఖురా లైన స్త్రీ చేతిలో పడ్డారు. ఆమెకు యెంతసేపు తననుగూర్చి గాని ఇతరులగూర్చి చింతయే లేదు.

అసలు టాము తన స్వవిషయముగూర్చి యోచన చేసికొననే లేదు. తన యజమాని భగవంతుని సాన్నిధ్యము

చేరగనే యెంతో ఆనందించాడు. మిస్ ఒఫీలియా యజమానురాలికి సేవ చేస్తూనే యున్నదిగాని, భీతాహము చెందిన పనివాళ్ళకు ఆమె యేవిధమైన సహాకారము చేయగలిగిన స్థితిలో లేదు. ఒక రోజున ఒక అందమైన యువతి కన్నీరు కారుస్తూ ఒఫీలియావద్దకు వచ్చినది. వచ్చి ఒఫీలియా పాదములపైబడి కాళ్లు పట్టుకున్నది.

"ఓ అమ్మగారు, ఆ యజమానురాలిని నన్ను క్షమించమనమని చెప్పండి. కాస్త సహాయము చేయండి. ఆమె నాకు కొరడాదెబ్బలు వేయించ పంపుతుంటట అని ఒఫీలియా చేతికి ఒక కాగిత మిచ్చినది.

అది మేరీ తన చక్కటి దస్తూరితో, ఈ కాగితము తెచ్చిన వానికి పది హేను దెబ్బలు కొట్టవలసినదిగా, కొరడా దెబ్బలు వేయువానికి వ్రాసి ఇచ్చినది. ఈ పనికత్తె మేరీ యెడల దురుసుగా ఉన్నదనుకొని ఆమె శిక్ష విధించిపంపినది. ఈ కొరడాదెబ్బలు వేయడానికి అక్కడ దుర్మార్గులైన క్రూరులుంటారు. ఒఫీలియాకు అటువంటి స్థలాలున్నవని తెలియును. కాని క్లేరీగారి మనుష్యులెవరు అక్కడకు ఇంతవరకు పంపబడలేదు. అందుకని మిక్కిలి నాజూకైన ఈ పిల్లనుగూర్చియె ఒఫీలియా మేరీవద్దకు వెళ్ళినది. కాని మేరీ వినలేదు.

"ఏమిటి నేను ముష్టి పదిహేను దెబ్బలనేగా చెప్పాను. అదేమిటి అదొక క్రూరమా. ఇలా నన్ను బాధపెట్టితే

వాళ్ళందరికికూడ కొరడా దెబ్బలు వేయిస్తాను" అన్నదా మేరీ.

పాపము ఒఫీలియా యెంతో బాధపడినది; తానింత నిస్సహాయురాలై పోయినానని కుమిలిపోయినది. పోనీ ఒక్క టాప్సి అయినా రక్షించబడినదిగదా యని సంతోషించినది, యెందుకంటె ఇప్పుడు టాప్సి ఒఫీలియా సొంత ఆస్తి అయిపోయినది. ఆమెపై ఇంకెవరికి హక్కు లేదు. మేరీ తన చుట్టాలతో ఆలోచించుకొని నిర్ణయించుకున్నది. తన బానిసలను, ఇంటిని, ఆస్తిని అమ్మేసి పుట్టింటికి పోవ నిశ్చయించినది. ఇది ఆ బానిసలకు యెంతో విషాదకరమైనది. అయినా ఆ బానిసలలో చాలమందికి ఈ యజమానురాలివద్ద పనిచేసేకన్న ఇంకెవరివద్దనైనా పనిచేస్తేనె మంచిదనిపించినది; వారు అదె నిర్ణయమునకు వచ్చారు. టామ్ మటుకు సెయింటుక్లేరీగారు తన కిచ్చిన వాగ్దానమును పురస్కరించుకొని ఒఫీలియాతో చెప్పటానికి పోయినాడు,

"అమ్మ అయ్యగారు నాకు స్వాతంత్ర్య మిస్తానని వాగ్దానము చేసినారు. అందుకోసమై అన్ని యేర్పాట్లు చేస్తున్నామనికూడ చెప్పారు. కాస్త మీరు అమ్మగారితో ఆ విషయముచెప్పి సహాయము చేస్తారా? బహుశా వారికి గూడ అయ్యగారి అభిప్రాయము తెలిసే ఉంటుంది" అని ఒఫీలియాతో చెప్పుకున్నాడు.

టాము విషయమై మళ్లీ ఒఫీలియా మేరీ వద్దకు వెళ్ళినది. ఒఫీలియా ఆమె తన భర్త అభీష్టాన్ని సంతృప్తి చేస్తుందిగదా యని అనుకున్నది. కాని మేరీ అన్న మాటలకు టాము పెట్టుకొన్న ఏదో ఆశాభావమునుగూడ పెకల్చి వేసినది.

"నేనెలా ఆతనిని విడుదల చేస్తాను గనుక ? మాకున్న విలువగల పరిచారకులలో ఆత నొకడాయెను? నేను మటుకు ఆ మాట వినను ఏమిటిది మీరందరు యెందుకు నన్నిలా వేధిస్తారు. ఓ మూలన పిల్లపోయి మొగుడుపోయి నేను చస్తుంటె. మీకు కనికరమైనా లేదేమిటి. ఇలాంటి చిన్న విషయములోగూడ నన్ను వేధించాలా?" అంటూ మేరీ కళ్ళనీళ్లు పెట్టుకున్నది. ఒఫీలియా పాపము యే సహాయము చేయలేక పోయినది.

ఆ మరునాడె టాము ఇంకా ఆరేడుగురు బానిసలు బానిస విక్రయ కేంద్రమునకు వేలము వేయడానికి పంప బడినారు.

# 17

టామును బానిసవిక్రియ కేంద్రమునకు వెళ్ళుట అదే మొదటిసారి. సెయింటుక్లేరీ పరిచారకులను ఆతనిని ఆ బానిస విక్రయ కేంద్రములోని ఒక పెద్ద గదిలోనికి తీసుకొనిపోయిరి. ప్రతివాడు తన పెట్టె సామానులను చేత బట్టుకొనినాడు. ఆ గదిలోనె అనేక రకములైన మనుష్యులున్నారు. కొందరు మాట్లాడుకుంటున్నారు. కొందరు దుర్మార్గముగా నవ్వుచున్నారు. మరి కొందరు ఇతరులను హాస్యము చేయుచున్నారు. అందరు పలువిధముల తమ దుఃఖాలను మరచిపోతున్నారు. టాము తన పెట్టెను తీసుకొని యేకాంతముగా కూర్చున్నాడు. అక్కడ అన్ని రకాల ఆడపిల్లలున్నారు. పసిపిల్లల దగ్గరనుండి మూల కూర్చుండె ముసలమ్మల వరకు ఉన్నారు. వాళ్ళలో ఒక పదేళ్ళ బాల యేడ్చి యేడ్చి నిద్రపోవటానికి ప్రయత్నిస్తున్నది. అప్పుడు తన సంగతి ఇతరులు పట్టించుకోరుగదా అనుకున్నది. పాపము నిన్ననే ఆ పిల్ల తల్లిని అమ్మివేశారు పాపము యేకాకిగా ఉన్నది. దాదాపు ఆ గదిలో యాభై మంది జనము బానిసలుగా విక్రయించడానికి మార్పిడిచేయబడుటకు వేచియున్నారు.

ఆ గదిలోనె ఇంకొక మూల ఒక తల్లి, పదిహేనేళ్ళ వంగుజాతిపిల్ల ఇతరులతో సంబంధము లేకుండా కూర్చు

న్నాయి. వాళ్ళు పరిశుభ్రమైన దుస్తులు ధరించి, సౌజన్యముగా ఉండి, కలిగిన వారి కుటుంబమునుండి వచ్చినట్లుగా తోచుచున్నది. వాళ్ళు కూడ టామువలెనే మంచిగా పెంపబడి ఉంటారు. వాళ్ళ యజమానురాలు దైవభక్తి గల్గినది, వీరంటె ఇష్టముతో చదువు అది చెప్పించి ఇతర బానిసలవలెగాక బాగా పెంచెను. కాని వాళ్ళ యజమానురాలు చనిపోయినది. ఆమె ఆస్తి యగు వీళ్ళు ఆమె తదనంతరము ఆమె కుమారునకు చెందిన ఆస్తియైనారు. ఆమె కుమారునకు పట్టినదల్లా యెల్లాగో అల్లాగు అయిన కాడికి వీళ్ళని తెగనమ్మేసి ఇంత డబ్బుచేసుకుందా మనుకున్నాడు. ఆ తల్లి-కూతుళ్ళు ఒకళ్ల దుఃఖాన్ని ఒకరు దిగమ్రింగడానికి ఊరికే యేడుస్తున్నారు. ఎమిలినీ యేడుస్తూ తల్లితో —

"అమ్మా నీ తల నా తొడమీదపెట్టి కాస్త నిద్ర పోవే."

"నేను నిద్రపోతానే అమ్మా ఇదె మనము ఒకరి నొకరు ముఖాలు చూచుకునె చివరిరోజుగదె."

నిన్న ఆ వ్యాపారి తన కూతురు వైపు చూచిన చూపుకు ఆ తల్లి తల దించుకుపోయినది. ఆ తల్లి తాను పెంచి పెద్దచేసి, ప్రేమతో పాఠాలు నేర్పి, బైబిలు చదివించి, భగవంతుని నమ్ముకో అమ్మా అని బోధించిన కూతురి గతికి ఆ తల్లి చింతించినది. ఆమెకు యేఆశ లేదు; యే రక్షణ

లేదు. ఇదివరకు ఆమె తన కూతురి సౌందర్యానికి మురిసి పోయేది. కాని ఇప్పుడో దానికోసమె ఆమె భయపడు తున్నది. అయినా ఆమె ఇప్పుడు చేయగల్గిన దేమి ఉన్నది, కేవలము భగవంతుని ప్రార్థించుటకన్న. ఇటువంటి బానిస కేంద్రాలనుండి ఆ భగవంతునకు యెన్ని ప్రార్థనలు పంపబడి నవోగదా! కాని ఈనాడు ఆ తల్లి పిల్లలు తమ వియోగ ఘడియలు గడుపుతున్నారు.

ఆ మరునాడుదయమునె అందరిని లేవగొట్టుతున్నారు. ఆ కాపలాదారుడు ఇందులో యెవరు బాగున్నారో చూడగా అందులో ఎమిలిని ఆమె తల్లియు కన్పించారు.

ఆ న్యూ ఆర్లియన్సులోని బానిస కేంద్రము అమె రికారాష్ట్ర మంతటికన్న చాల గొప్పది. ఇక్కడనుంచె దక్షిణాది క్షేత్రపాలురు తమకు కావలసిన మనుష్యులను కొనుక్కొనేవారు. ఇక్కడే ధనికులైన వ్యాపారస్థులు, భూస్వాములు చిన్న గొప్ప వ్యవసాయదారులు తమకు ధనమును చేకూర్చిపెట్టే మనుష్యులను కొనుక్కొనేవారు. ఆ ఉదయాన్నె మన మిత్రులు అమ్మబడుతుంటె ఆ మార్కె ట్టులో జనముగూడి, ఒకరి నొకరు నవ్వుకుంటూ, పలుక రించుకుంటూ మాట్లాడుకుంటూ, తమ బోటి సాటి మానవు లనె, సంతలో అమ్మబడె జంతువులను పరీక్షించినట్లు, ఆ అమ్మబడె వారిని వ్యాపారస్థులు జాగ్రత్తగా పరికిస్తు న్నారు. వేలము మొదలుపెట్టక పూర్వమె ఇందులో

తనకు కాబోయె యజమాని యెవరో యని టాము ఆ ప్రజను ఆశ్చర్యముతో పరికిస్తున్నాడు. ఒక పొట్టివానిని మురికి దుస్తులు ధరించి, తనకు తగినట్లుగా ఉన్నవారి మధ్యనున్న స్థూల బలిష్ఠకాయుని టాము చూచెను. వాడు తన మురికిచేతులతో, మరీ మురికి గోళ్ళతోను తాను కొనదలుచుకున్న వారిని పట్టి పరీక్షించి చూచుకొనె పద్ధతిని చూచి అదరిపోయినాడు. అలా చూచుకుంటూ వాడు టాము వద్దకు వచ్చాడు. వచ్చి టామును నోరు తెరువమని లాగి వాని పల్లు పరీక్షించాడు. ఏవీ నీ కండలు చూపించు, నీ చొక్కా చేతులు మడవుమన్నాడు. నీబలము వేగము చూడాలి గనుక యెగిరి దూకమన్నాడు.

"నిన్నెక్కడనుండి తెచ్చారు" అని టాముని ప్రశ్నించాడు.

"కెంటకీనుండి అయ్యా" అన్నాడు.

"నీవేమేమి చేస్తావు" అన్నాడు.

"అక్కడ యజమాని క్షేత్రమును చూచేవాడిని" అన్నాడు.

"ఈ కథంతా నేను నమ్మను" అన్నాడు. తరువాత వాడు సెయింటు క్లేరీగారి ఇంకొక పనివానిని చూచాడు. వాడు మంచిగా దుస్తులు వేసుకొని పాలిష్ వేసుకున్న

బూట్లను తొడుక్కున్నాడు. వాడి బూట్లమీద తుపుక్కున ఉమ్మేసినాడు. అక్కడనుండి ఎమిలిని ఆమె తల్లి ఉన్న చోటికి వెళ్ళినాడు. వాడు తన మురికిచేతులతో ఆ పిల్లను గట్టిగా పట్టి చూచాడు. దాసని దాని తల్లిమీదకు గట్టిగా త్రోసి వేసినాడు.

సరె ఇంతలో వేలము మొదలైనది. సెయింటుక్లేర్ పనివాళ్ళు చాల త్వరగా అమ్ముడుపోయారు. చిట్టచివరకు కొనేవాళ్ల ముందు నిలవబడె వంతు టామునకూడ వచ్చినది. వేలము పాట మొదలైనది. టామును కొనేశారు. వాళ్లి అమ్మబడిన స్థానమునుండి దిగగానే ఆ మురికి క్రూరమైన వ్యక్తి వాళ్ళను ప్రక్కకు లాగివేసేవాడు. తన క్రొత్త బానిసతో పో అక్కడపోయి నిలుచో అన్నాడు. టాము విస్తుపోయి శాంతముతో అట్లాగేపోయి నిలుచున్నాడు. ఇంతలోనె ఎమిలిసీ తల్లిని ఒక వయస్సు మళ్ళిన పెద్దమనిషి కొన్నాడు.

“అయ్యా నా కూతురినికూడ మీరు కొనండి” అన్నది ఆ ఎమిలిని. “నాకు కొనాలనె యున్నది, కాని నా దగ్గర డబ్బులేదు” అన్నాడు ఆ వ్యక్తి. ఇంక తన కూతురు అమ్మకపు స్థానానికి వచ్చేసరికి ఆ తల్లి గుండె పగిలిపోయినది. ఆ తల్లినికొన్న ఆసామి ఆ పిల్లను కొనటానికిగూడ ముంద

రికి వచ్చాడు. కాని విలువ చాల పెరిగిపోవటమువల్ల అతను పాట వదలివేయవలసి వచ్చింది. చివరకు ఆ పిల్లను అమ్మేశారు,—ఎవరికి? పాపము ఆ దురదృష్టవంతురాలు టామును కొన్న ఆ క్రూరుడైన మురికివాడే ఆమెనుకూడ కొన్నాడు. వాడి పేరు లిగ్రీ. ఆ పట్టణానికి కొంతదూరములోనే వానికి ప్రత్తి పండించే క్షేత్రమున్నది. వాడు టామును ఎమిలీని ఇంకా ఇద్దరు మనుష్యులను గొడ్లను తోలినట్లు ఒక త్రోవ తోసేశాడు. ఆ పిల్ల యేడుస్తూ బయలు దేరినది. పాపము ఆ పిల్ల తల్లినిగొన్న యజమాని యెంతో దుఃఖించాడు; కాని అతను అంతకన్న నేమీ చేయలేక పోయినాడు. ఇల్లాగే తల్లులు పిల్లలు యెందరెందరో ప్రతి రోజు అమ్మబడేవారు అక్కడ. ఆ యజమాని వేరొక దిక్కునకు నడిచిపోయాడు. ఎమిలిని తల్లికూడ ఆతని వెను వెంటనే నడిచిపోయినది.

# 18

టాము ఒక మురికి చిన్న పడవ క్రిందభాగమున కూర్చుండెను. చేతులకు కాళ్ళకు బేడీలు వేయబడి యుండెను. అంతకన్న అతని హృదయము మిక్కిలి బరువై యుండెను. అతను తన భార్యా పిల్లలను తలచుకొని, తాను సెయింటుక్లేరి యింటిలో గడపిన సుఖజీవితము స్మర

ణకురాగా బంగారు ఈవా దృష్టికి రాగానే అతని హృదయము బరువయ్యెను. క్రితం జరిగినదంతా తలచి చూచాడు, ముందు ఏమి కానున్నదో, యని ఖేదము పొందాడు.

సైమనులిగ్రో టాముయొక్క నూతన యజమాని వాడు ఏండ్లు గడచినకొద్ది బానిసలను కొంటూవుండేవాడు. అట్లా వాడి దగ్గర ఎనిమిది మంది స్త్రీ పురుషులు, ఒకరి కొకరు జతగా, యినుప గొలుసులతో, కట్టివేయబడి యున్నారు. వారందరిని వాడు, తన ప్రత్తి పండించెడి పొలములలో పనిచేయుటకు తీసికొని పోవుచుండెను. అందరూ పడవఎక్కి కూర్చొనగానే లెగ్రీవాళ్ళను చూచుటకు వచ్చెను. టాము యింకా తన మంచి దుస్తులలోనే యుండెను. శుభ్రమైన బొక్కా పాలిష్ వేసిన బూట్లను అతను అమ్మబడేటప్పుడు వేసుకున్నాడు. లెగ్రీటాము యొక్క పెట్టెను తెరచెను. అందులోనుండి పాత బొక్కా లాగూలు, టాము బండిపని చేసేటప్పుడు వేసుకొనేవి చూచాడు. తరువాత టాము వద్దకువచ్చి, వాని బొక్కాపట్టిలాగి, పాత బట్టలు వేసుకొమ్మని చెప్పాడు. టాము పాత దుస్తులే వేసుకొనెను. కాని ఆ తొందరలో తన బైబిలు, ఆ మార్చిన లాగూలోనే ఉండిపోయినది. ఈవా వస్తువులు అని చెప్పి టామూ దాచుకొన్న కొన్నిటిని, నదిలో పారవేశాడు. టాము యొక్క సిల్కు జేబు రుమాల తన జేబులోనే పెట్టుకొన్నాడు. తరువాత టాము యొక్క ప్రార్థనాపుస్తకము చూచాడు.

"ఓ నీవు మతస్థుడవా, అదా? సరే మనదగ్గర అదేమీ చెల్లదు. నేనే నీ చర్చిని ఇహానుంచి తెలిసిండా. ఇక నేను చెప్పినట్లు నీవు చెయ్యవల్సిందే.

టాము ఏమి మాట్లాడలేదు. కాని అతనిలో ఏదో పోరాటము జరిగినది.

"అది కాదు" అనిపించింది. ఈవా చదివిన జీససు వాక్యములు అతని మనస్సుకు స్ఫురించినవి.

"భయపడకు. నేను నిన్ను రక్షించాను. నా పేరునసే నిన్ను పిలిచాను. నీవు నా వాడవు" అన్న ధ్వనిని గ్రహించాడు.

కాని సైమను లిగ్రీ ఆ ధ్వనిని గ్రహించలేదు. ఈ శబ్దము వాడికి అపరిచితము. వాడు టాము యొక్క బట్టల పెట్టెను తీసికొనెను. దానిలో శుభ్రముగా సర్ది యున్న సామానులను, కొనేవాళ్ళకు అమ్మేశాడు. తరువాత టాము వద్దకు వెళ్ళి "ఇదిగో టాము, నీ వస్తువులను దాచుకొనే కష్టము లేకుండా చేసేశాను. మాప్రాంతములో ఒక నీగ్రోకు ఒక సంవత్సరము పొడుగునా, ఒక బట్టల జత చాలును. కనుక నీకు కావలసినదంతా నీ దగ్గరనే యున్నది.

ఎమిలి తనకన్న పెద్దదైన రంగుజాతి స్త్రీతో ఇనుప గొలుసులతో బంధింపబడినది. లిగ్రీ ఎమిలిని వద్దకు వెళ్ళాడు. ఆమె పీడి చేయిపట్టు తప్పించుకొనటానికి ప్రయత్నించగా వారలనుచూచి అరచాడు.

నేను నీతో మాట్లాడేటప్పుడు నీవు కులాసాగా వుండాలి. ఇదిగో చూశావా, అని వాడు తన పెద్ద పిడికిలిని బిగించి చూపాడు. ఈ యెముకలున్నాయె నీగ్రోలను కొట్టి కొట్టి గట్టిపడినవి. నేను చెప్పినది నీవు చెయ్యాలి తెల్సిందా, నేనేమి మెత్తటి మనిషిని కాను. కాబట్టి జాగ్రత్తగా మసలి చెప్పింది చెయ్యి.

తరువాత లిగ్రీ వాళ్ళను వదలి ఇంకొక బల్ల వద్దకు తాగటానికి వెళ్ళినాడు.

ఎమిలిని తన ప్రక్కనున్న స్త్రీతో మాట్లాడబోయినది. ఆ స్త్రీ తన భర్తనుండి నలుగురు పిల్లలనుండి వేరుచేయ బడి గుండె పగిలే దుఃఖములో ఉన్నది. ఎమిలిని చిన్నప్పటి నుండి క్రైస్తవ మత ధర్మములు నమ్ముచూ, బైబిలును చదువుచుండేది, కాని యిప్పుడు ఆ భగవంతునే నమ్మగలదా తను, అలా ఆవ్యక్తి క్రౌర్యమునకు బలి గావింపబడినదే.

పడవ బయలుదేరినది. ఆ విషాద నిస్సహాయరూప ములగైకొని, ఒక చిన్న పట్టణములో, లిగ్రీ ఆయన పరి వారమున్నా చివరకు దిగారు.

లిగ్రీ క్షేత్రానికి ఆ పరిదేశానికి ఒక రోజు ప్రయాణ మున్నది. లిగ్రి బండి త్రోలుచున్నాడు. ఆ యిద్దరు ఆడ వాండ్లు ఇనుప సంకెళ్ళతో బంధింపబడి యున్నారు. వాళ్లు గూడ సామానులతో పాటు, ఒక మూల పడియున్నారు. టాము ఇతర మనుష్యులు కాళ్లీడ్చుకుంటూ, వెనక వస్తు న్నారు. అది అడవి ప్రదేశము, అనాగరిక ప్రదేశము— లిగ్రీ ఎస్టేటు ఆ పరిదేశానికేమి తీసిపోదు. ఆ యిల్లు ఆ క్షేత్రము పూర్వము ఒక పెద్దమనిషికి చెందియుండేది. కాని లిగ్రీ డబ్బు చేయటానికే ఆ యాస్తిని కొన్నాడు. వాడు ఉద్యానవనమును బాగుచేయ చూడలేదు. ఆ యింటిని గూర్చి అద్దె నమాత్రము వహింపబడలేదు. తన పనివారిని గూర్చి అంతంత మాత్రమే శ్రద్ధవహించేవాడు. వాడికి కావలసినదల్లా ఎట్లాగో అట్లా డబ్బు పెంపుచేయుటనే.

ఆ బండి ఇంటి ముందుకు రాగానే, ఇద్దరు పెద్ద నీగ్రోలు పరుగెత్తుకుంటూ వచ్చారు. వాళ్ళిద్దరు అనా గరికులవలెను, క్రూరస్వభావులుగను, ఉండిరి. చిరిగిన బట్టలు వేసికొనిరి. మూడు నాలుగు క్రూరమైన కుక్కలు వారివెంట పరుగెత్తుకొని వచ్చెను. లిగ్రీ కుక్క లను చేతితో తట్టెను.

"మీకేమి జరుగుతుందో తెలుసుకోండిరో" అన్నాడు. వాడు టామ్ అతని ఇతర పరివారముతో, "ఈ కుక్కలకు నీగ్రోలను పట్టుటలో శ్రద్ధ వహించుటకు శిక్షణ ఇచ్చాను. మీరు పారిపోవటానికి ప్రయత్నించారా. మీరు తొలిక

ప్రాప్యామే, ఇని చీల్చి తినివేస్తవి. మేరాకంభో ఏమిరా క్షేంబో పరిస్థితులు ఎట్లాగున్నవి. మేమిటి."

"పస్పుగా అండి" అన్నాడు మురికిబట్టలతో గుడ్డాన్ని పట్టుకొని. వీళ్ళిద్దరిని లిగ్రో తన కుక్కలలాగే, చెప్పినది చేయ టానికి తయారుచేశాడు. వాళ్ళల్లో వాళ్ళ యిద్దరికి ఒకరిని చూస్తె ఒకరికి అసహ్యము. అందరికి వీళ్ళిద్దరంటే అసహ్యము. వాళ్ళ యజమాని యందలి భయముచే, యజమాని ఆజ్ఞలను పాలించేవారు. ఆకాశంబు వీళ్ళకి వాళ్ళకి యిల్లు చూపించి, ఈ పిల్లను మన దగ్గర ఉంచు, అని ఆ రంగుజాతి స్త్రీని మీందపు త్రోసెను. ఎమిలిసీని ఇంట్లోకి పోమ్మనమన్నాడు. టాము ఎమిలిసీని జాగ్రత్తగా చూస్తూఉండగా, ఒక నల్లని భయంకరమైన ముఖమును చూచాడు. తరువాత ఒక స్త్రీ లిగ్రీతో మాట్లాడుట చూచాడు. లిగ్రీ దానికి కోపముతో సమాధానము ఇచ్చినాడు.

టాము ఇంకేమీ వినలేదు. శంభూతో తను వుండే యిల్లు చూచుటకు వెళ్ళాడు. టాము ఏదైన శుభ్రమైన గదేమో; అక్కడ ప్రశాంతముగా కూర్చొని, ఏ రోజు నైనా బైబిలును చదువుకోటానికి వీలుంటుందేమో అను కున్నాడు. కాని ఆ ఆశకూడ నిరాశై పోయినది. శంభో ఆ టామునకు ఒక మురికి గుడిసెల వరుస చూపించి, నీకు నచ్చిన దేదైనా సరే తీసికొమని చెప్పినాడు. అన్నీ పండిపోయి యున్నవి. నన్ను ఎక్కడ ఉంచాలో నాకే తెలియదు అని అన్నాడు.

## 19

టాము తాను చెయ్యాల్సిన పనిని త్వరగా నేర్చుకున్నాడు. తన ప్రక్కనున్న బాధ దుర్మార్గమునకు అతడు చలించి, అలసిపోయి జబ్బున పడ్డాడు. కాని తాను తనచేతనైనంత చేయాలనుకున్నాడు. భగవంతుడే ఉన్నాడు అంతా చూడ్డానికి అనుకున్నాడు.

లిగ్రీ టామును కొనుక్కువచ్చిన కారణము తనకు పనిలో సహకారిగా ఉంటా డనుకొన్నాడు. టాము చాల మంచి పనివాడని కనిపెట్టాడు. కాని టాము వలచిన పనికి వ్యతిరేకి అని లిగ్రీ కనిపెట్టాడు. టాము చాల నిదానముగా ఉండేవాడు. చెప్పినది చేసేవాడు. కాని లిగ్రీ తను చేస్తున్న దుర్మార్గమంతా చూస్తున్నాడని తెలుసుకున్నాడు. టామూనొక్క మంచితనమె, లిగ్రీ క్రూరత్వాన్ని విమర్శిస్తున్న ఒక మహా విమర్శి ఆయెను. టాముగూడ తనవలె క్రూరత్వాన్ని విమర్శిస్తున్న ఒక మహా విమర్శి ఆయెను. టామును గూడ తనవలె క్రూరుడుని చేయాలనుకున్నాడు. అప్పుడు లిగ్రీ తను చెప్పినట్లు చేస్తాడను కున్నాడు.

పొలముమీద రోజుపనియె చాల కష్టముగా ఉన్నది. పొద్దు పొడిచిన దగ్గరనుంచి పొద్దుగూకేవరకు ఆ బానిసలు

దూదిని తట్టలలోనికి యెత్తి గట్టిగా క్రుక్కి ఆ తట్టల నెత్తి కెత్తుకొని పోవాలి. పొద్దు కుంకే వేళకు అందరూ తూక ము తూచే చోటికి రావలెను. అక్కడ ప్రతి తట్టను తూకము వేస్తారు. బరువు తగ్గితే శిక్ష వేస్తారు. ఒక ఉదయమున వాళ్ళందరూ పనిచేయుటకు మొదలు పెట్టిరి. టాము క్రొత్త గా వచ్చిన స్త్రీని చూచాడు. సన్నగా పొడుగ్గా నాజూకుగా మంచి దుస్తులు వేసుకొని ఉన్నది. బహుశా ముప్పది అయి దేళ్ళుంటాయి. ఒకప్పుడు సుందరియే, కాని, ఆమె ముఖము దుఃఖము వల్లను, స్రుక్కి చూపులవల్ల కళా విహీనముగా ఉన్నది. టాముకు ఆమె ఎవరో తెలియదు. కాని ఇతరు లంతా ఆమెను ఎరిగి యున్నారు. టామూ ఆ రంగుజాతి స్త్రీ ప్రక్కనే పనిచేస్తున్నాడు. ఆమెకు సుస్తీగా ఉండుట వల్ల పని చేయ లేక పోయినది. టాము తన తట్టలోనుండి ఆమె తట్టలోనికి కొంత ప్రత్తిని తీసిపెట్టినాడు. అప్పుడే శంభు వచ్చినాడు. వాడు టాము దూదిని ఆమె బుట్టలో వేయ టము చూచినాడు. ఒక్క మాటా మాట్లాడకుండా పాపము దానిని కాలితో మూర్ఛపడిపోయేవరకు తన్నాడు. తరువాత కొరడాతో టాము ముఖముమీద కొట్టాడు. ఆరోజే ఆ అమ్మాయిచేత పని చేయించుచుండగా టాము మరల ఆమెకు సహాయము చేసినాడు.

"ఓ మీరు నాకు సహాయము చేయకూడదు" అన్నది ఆ పిల్ల. వాళ్లు మిమ్మల్ని ఏంచేస్తారో మీకు తెలియదు. "నేనది భరిస్తాను" అన్నాడు టాము నీకన్న నేను యెక్కువగా భరించగలను.

ఇంతకుముందు టామును చూచిన ఆ క్రొత్త మనిషి, టాము అన్నమాటలను విన్నాడు. ఆమె కొంత దూదిని, తీసికొని టాము బుట్టలో వేసినది.

"నీకు ఇక్కడి సంగతి ఏమీ తెలియదు" అన్నది ఆమె తెలిస్తే అలా చేసేవారుగాదు. ఇక్కడ మీ కెవరికి సహాయము చేసేది చేయలేరు. నీ సంగతి నీవు చూచుకొనుటయే గగనమవుతుంది.

కాని శంభు ఇది చూచాడు. వెంటనే దగ్గరికివెళ్ళి, కొరడా ఊపుతూ, అరుస్తూ, ఆ క్రొత్త మనిషి లేచి నిలుచున్నది. వాని వంక చూచినది, ఆమె కళ్ళు మెరుపువలె మెఱసినవి.

కుక్కా! తీకరా ధైర్యముంటే అని అరిచింది. ఆమనిషి భయపడ్డాడు వెనకడుగు వేశాడు. అలా ఆ పూట గడచి పోయినది. సాయంత్రం చేసిన పనిని తూకమువేసే సమయము వచ్చినది. బానిసలుగా ఆ బానిసలు వరుసగా నిలువబడ్డారు, ఆ తూకము వేసే శీలముందు. లిగ్రీ శంభోక్కిప్రక్కన తూకము దగ్గర నిలువబడ్డాడు.

"ఆ క్రొత్తరంగు పిల్ల మహా ఇబ్బంది పెడుతున్నదండి. ఏ పని సరిగా చేయటములేదండీ!" అన్నాడు.

"ఓరీ నల్ల కుక్కా" అన్నాడు "లిగ్రీ! ఎముకలు విరుగలేదా నీగ్రో. ఇదిగో ఏమట్టా నేనేమిచేస్తానో నాకే

తెలుసునుర, టామునే దానికి తగిన శిక్ష వేశేటట్టునేస్తాను. దీని కదే శిక్ష. అదే నిర్ణయము."

"చాల బాగుండండి అయ్యా" అన్నారు. ఆ శంభో కొంచెము వికృతంగా నవ్వుచూ "కాని టాము కేసీలు, ఆ టోసీ తట్టలో పడేశారయ్యా తూకము సరిగానే ఉంటుంది."

"మీా కెందుకురా" అన్నాడు లిగీ్రి. "నేను తూస్తానుగా."

ఆ ఇద్దరు స్త్రీలు వచ్చారు. లిగ్రీ తూకమునద్ద చేరాడు. ఒక్కొక్కడినే రమ్మన్నాడు. ఆ తట్టలనుచూచి తూకమును నమోదు చేశాడు. టాము ఆతృతతో పాపము తాను సహాయము చేసిన స్త్రీ సంగతి ఏమవుతుందా అని చూస్తున్నాడు. ఆమె తట్ట తూకానికి సరిగానే ఉన్నది కాని లిగ్రీ కోపము సభినయించాడు.

"మిల మిల మిలసే సోమరిపోతుదానా తూకము మళ్ళీ తగ్గింది. పక్క నిలుచో చూస్తాను." పాపము బాధపడుతూ ఆమె పక్క నిలుచున్నది. కొ్రొత్తదైన మిస్ కేసీ తన తట్టను గర్వముతో నిర్లక్ష్యముతో అందిచ్చినది. ఆమె ఫ్రెంచిభాషలో యేమేమో లిగ్రీతో చెప్పింది. ఆమెనంక వాడు భయము కోపముతో చూచెను. అది వెళ్ళిపోయినది.

"అరె టాము" ఇలా రా అన్నాడు. లిగ్రీ నన్ను వీళ్ళందరిపైని నిపా పెట్టుతానురా. నీది తక్కువ చేయి

గాదు. ఇవ్వాళనుంచే నీకంతా నేర్పిస్తాను. దానిని ఆరంగు జాతి స్త్రీని చూపించి "చానగొట్టరా" అన్నాడు ఆ లిగ్రీ.

"క్షమించండి అయ్యగారు నన్ను అలాంటి పనుగులకు పెట్టకండి" అన్నాడు టాము. నాకది. కుదరదు. నేనెప్పుడు అలాచేసిన వాడనుగాను, నా చేతగాదు.

"నీవు నా దగ్గరున్నావుగనుక, నీవు క్రొత్త పనులు చేయాలి" అని టాము ముఖముమీంద కొట్టాడు. ఇప్పుడు యేదీ చెప్పరా నేను చేయలేనని. "అవును అయ్యా" అన్నాడు టాము. కంటినుండి కారుతున్న రక్తాన్ని తుడుచుకుంటూ, నేను రాత్రింబవళ్ళు చచ్చేవరకు చాకిరిచేయటానికి సిద్ధంగా ఉన్నాను. కాని ఈ పని చేయటము సరియైనదని నాకు తోచదు. అయ్యా నే నెప్పటికి అది చేయజాలను.

టాము సౌమ్యముగా, గౌరవముగా జవాబు చెప్పాడు. దీనిని లిగ్రీ వాడు పిరికివాడుగనుక ఇల్లా చెప్పాడు అని అనుకొన్నాడు. టాము ఇలా అనగానే, అక్కడున్న పనివారంతా ఆశ్చర్యముతో చూచారు. తమ యజమాని ఏమి చెబుతారా అని చూస్తున్నారు.

లిగ్రీకి ఇది ఎంతో ఆశ్చర్యము గల్గించింది. ఎమిరా నల్లకొరివి దయ్యమా! నేను చెప్పినది న్యాయముగాదని, నీవట్రా నాకు చెప్పేది. నీకెంటురా న్యాయమైతేనేమి

అన్యాయమైతేనేమి. నువ్వు ఏమనుకుంటున్నావు. నీఅంతర మెంత, నీవు నాకు న్యాయము చెప్పుతావా? అంటే ఈ ఆడ దానిని కొట్టడము తప్పని దాని తరఫున వాదిస్తావా.

"నే ననుకునేది చెప్పాను. పాపము అది జబ్బుతో సుస్తీగా ఉన్నది. మీకు నన్ను చంపినాసరే మీకిష్టమైన నన్ను చంపండిగాని, నే నెవరినీ కొట్టలేను, నే నెప్పుడూ కొట్టను, నేను ముందుచానన్నైనా చస్తాను," అని.

టామము నిశ్చలముగా జవాబు చెప్పినాడు. లిగ్రీకి దానిని మార్పించటానికేమి వీలు లేనట్లు స్ఫురించినది. అస హ్యముతోను, కోపముతోను అదరిపడినాడు.

"ఆ పాపమురా మనకు మంచిని బోధించే మతపిచ్చి నాడురా? ఏరా వెధవా బైబిలులో పనివాళ్ళు యజమాను లకు అణగి ఉండాలని లేదురా! నేను నీ యజమానినేరా పన్నెండు వందల డాలర్లు పోశానురా, నీ శరీరము అసలు నీది కాదురా" అని ఆ టామును తన బూటు కాలితో గట్టిగా తన్నాడు "ఇప్పుడు చెప్పరా" అన్నాడు.

ఆబాధా వేదనల చీల్చుకొని ఒక ప్రశ్న ఒక దివ్య కాంతి టాము ఆత్మకు గాన్పించినది. టాము అమాంతము నిటారుగా నిట్ట నిలువున నిలబడి, దేవునివైపు ఆకాశమువైపు ముఖము త్రిప్పాడు.

"లేదు లేదు, మీరుమట్టుకు నా ఆత్మను కొనలేదు. ఈ నా ఆత్మ మీది కాదు. దీనిని భగవంతుడే కొన్నాడు.

ఇది ఆయనకే అంకితము. జీససు నా ఆత్మను రక్షించాడు నీవు నన్ను బాధించలేవు" అన్నాడు.

"నేను నిన్ను బాధించలేనూ" అన్నాడు లిగ్రీ "చూస్తావుగా. అరేయి శంభో క్వింబో చూడండిరా ఈ కుక్కను నెల్లాళ్ళ వరకు మళ్ళా మరపుకు రాకుండా చావ గొట్టండిరా."

ఆ ఇద్దరు నీగ్రోలు టామును పట్టుకున్నారు. వాళ్ళ ముఖములో క్రౌర్యము ఉట్టిపడుతున్నది. వారు టామును ఈడ్చుకు పోయినారు.

# 20

ఆ రాత్రి చాల పొద్దుపోయేవరకు పాపము టాము తిన్న దెబ్బలనుండి రక్తము గారుతూనే ఉన్నది. విపరీతమైన బాధ పడినాడు. ఒంటరిగా ఆ పాడు గుడిశెలో నేలమీద, చుట్టూరా విరిగిన ఇనుపసామాను తుక్కు ముక్కలమధ్యన ఆ నేలమీదనె పడుకున్నాడు. ఆ రాత్రి అతనిని బాగా చావ చితకకొట్టారు. ఆ దోమలబాధవల్ల పుళ్ళబాధ మరీ యెక్కువైనది. దాహము మండి పోతున్నది. దాహము తగ్గించుకోటానికి కాస్తని నీళ్ళకోసము

యెంతో బాధపడ్డావు ఓ ప్రభూ ! కాస్త ఈ భూమిమీద ఉన్న నాపై కృపజూడు, నాకు విజయమివ్వమని, టాము హృదయపూర్వకముగా ప్రార్థించెను. ఆతను యెంతో బాధతో ప్రార్థించెను. ఇంతలో అతను యెవరిదో కాలి చప్పుడు విన్నాడు. తరువాత దీపమును చూచాడు. అతడు మంచినీళ్ళ కోసము అరిచాడు. ఆ వచ్చినది తాను ఉదయమున చూచిన కేసీయేనని గుర్తించాడు. ఆమె తన కోసము ఆనీరు తీసుకువచ్చినది. గ్లాసు వెంట గ్లాసు టాము నీరు త్రాగాడు.

"నీకు కావలసినదంతా త్రాగు" అన్నది. నీ వంటి అభాగ్యుల సహాయముసకై ఇలా వచ్చుట ఇది నాకు మొదటి సారిగాదు. త్రాగు నీ కిష్టమైనన్ని మంచినీళ్ళు, ఆమె ఒక పాత చాప పరచి "దీనిమీదకు దొర్లగలవా" అన్నది. దాని మీద తడి బట్టలు పరచినది. ఆ గట్టి పక్క మీద పడుకోటానికి ఆమె టాముకు సహాయము చేసినది. ఆ చల్లని బట్టలు టాముకు కాస్త శాంతి నిచ్చినవి. కేసీ ఆతని గాయాలకు తాను తీసికొనివచ్చిన మందు పూసినది. తన చేతనైనది, తన చేతనైనంత సహాయము చేసినది. తరువాత నేలమీద ఆతని ప్రక్కనే కూర్చున్నది.

అలాగే మౌనముగా చాలసేపు ఉండి ఉండి "ఇక్కడ పెనగులాడి లాభములేదు. నీ వేమో ధైర్యస్థుడవుగా ఉన్నావు. నీవు చేసినది సరైనదే. కాని ఈ యజమాని

ఒక రాక్షసుడు. నీకన్న బలవంతుడు. నీవు నీ పట్టుదల నదలి వేయి."

ప్రణబాధతో మూల్గుచు ఆమె చెప్పినది చేద్దామను కున్నాడు.

ఓ దేముడా భగవంతుడా నే నెలా నా పట్టు వదిలి పెట్టేది.

"ఇలా భగవంతునిగూర్చి మొరపెట్టుకుంటే లాభము లేదన్నది" కేసీ. ఆ దేముడు వినడు, దేముడనేవా డెక్కడ లేడు. అంతా మనలను అణగద్రొక్కాలనె చూస్తున్నారు. మన కంతా వ్యతిరేకముగా ఉన్నారు; మన మెందుకు దానిని అడ్డుపెట్టటానికి ఆపటానికి ప్రయత్నించాలి.

టాము అలా చీకటిలో పడుకొని ఉండగా, కేసీ తాను లిగ్రీతో అయిదేళ్ళ సావాసమువల్ల ఆతని క్రౌర్యము మర్మార్గాన్ని తెలుసుకున్నానన్నది. ఇప్పుడు ఎమిలిసీ కూడా అదే జీవితములోనికి దింపబడు తున్నప్పటికి కూడ ఆ పిల్ల భగవంతునే నమ్ముకొని తల్లి చెప్పిన పద్ధతిని అనుస రించి జీవించ నిశ్చయించినది. అంటూ కేసీ వికృతముగా నవ్వినది. ఇటువంటి చోట యెవరైనా మంచిది సరైనది చేయుట యేమిటూ అని నవ్వినది.

ఆ కేసీ హఠాత్తుగా నిలుచున్నది. "అమ్మా ఆమూల నాకోటు పడేసినాను, ఆ జేబులో నా బైబిలున్నది" అన్నాడు

టామూ. బాగా చదవబడుటచేత బాగా నలిగిన పుస్తకము దీసి ఇచ్చినది. టామూ ఆ వ్రేళ్ళనొప్పితోనే తాను మామూలుగా చదువుకొనే పుట త్రిప్పాడు. తాను అనేక మారులు చదివిన జీసను చివరి ఘడియల విషయమే చదివాడు. జీసను మిత్రులవల్ల ద్రోహము చేయబడ్డాడు. అందువల్లనే శిలువ వేయబడ్డాడు. ఆ బైబిలును ఆమెకిచ్చి జీసను శిలువమీద ఉండి, మేకులచే బిగించబడి తన మృతికి శిలువ వేయుటకు కారణమైన వారిని గూర్చి జీసను పలికిన భాగమును కేసీని చదవమన్నాడు.

కేసీ "తండ్రి! క్షమించు వాళ్ళకు వాళ్ళేమి చేస్తున్నారో తెలియదు, వారిని క్షమించు." ఆ ప్రభువు వాక్యములు చదివి కన్నీరు కార్చినది.

"అల్లాగే మనము ఉండగలిగితే" అన్నాడు టామూ. ఓ భగవంతుడా యేసుప్రభూ సహాయము చేయి." కానే సాగ టామూ "అమ్మా మీరుచూచి చదివారుగదా భగవంతుడు మనన్ని గమనించకనే మనకు కష్టాలపాలు వ్యథలపాలు చేశారన్నారు. కాని దివ్యుడు, దేముని కుమారుడైన యేసు ప్రభువున కేమైనది. బాధావ్యథలవల్ల భగవంతుడు మనకు దూరమైనాడనే భావముకూడదు. భగవంతుడు సహాయము చేస్తాడు, నాకు తెలుసు. నన్ను ఆయన రక్షిస్తాడు అదినే నెరుగుదును.

ఆమె యేమీ జవాబు చెప్పలేదు. కొంచెము సేపు తాళి మళ్ళీ కేసి మాట్లాడింది. అప్పుడే టామ్ ఆమె విషాద గాధను వినెను. ఆమె ధనవంతుల ఇళ్ళలో పెరిగి కాన్వెంటులో చదివినది. సంగీతము కుట్టుపని నేర్చుకున్నది. దాని వల్ల కొంత ధనార్జనకూడ చేసేది కాని ఆమెతల్లి ఒక బానిస, తండ్రి చనిపోగానే ఆమెను అమ్మివేశారు. తన మొదటి భర్త యైన ఒక యువకుడు ఆమెను గాఢముగా ప్రేమించాడు. చాలాయేండ్లు వానితో నేడుండి ఇద్దరుపిల్లలను కన్నది. ఆమెకు హెన్రీ అనే కొడుకు, ఒక కూతురు ఉన్నారు. ఆమెభర్తకి డబ్బు నష్టమైపోగానే ఆమెను, ఆమె పిల్లలను అమ్మివేశారు. మొదట వారందరు కలిసే ఉన్నారు. కాని ఒక దుర్దినమున ఆ ఇద్దరు పిల్లలు అమ్మివేయబడ్డారు. వాళ్ళు ఎక్కడకు అమ్మివేయబడ్డారో యేమో తెలియదు. మళ్ళీ తాను ఇంకొకరికి అమ్మివేయబడ్డది. ఆయజమానితో ఆమె సుఖము గానే ఉన్నది. ఆమెకు మళ్ళీ ఒక కొడుకు పుట్టాడు. ఈ తడవ కేసీ ఆ పిల్లడికి రాబోయే దుఃఖము భరింపలేక, రెండు వారాలు వానికి విషమిచ్చి ముద్దుపెట్టుకొని చేతులతోనే నేల పాలు చేసుకున్నది. కాని కేసీ తానలా చేసినందుకు దుఃఖించక కొడుకుకు దుఃఖము లేకుండా చేశానుగదాయని సంతోష పడినది. ఆమంచి యజమాని చనిపోయాడు. అల్లా కేసీని ఒకరితరువాత ఒకరు కొన్నారు చివరకు ఈ దుర్మార్గుడు క్రూరుడైన లిగ్రిపాల పడ్డానన్నది ఆ కేసీ.

కేసీ తన విషాద గాథనంతా చెప్పి టామును ఇంకొక గ్లాసెడు నీరందిచ్చెను. ఆతనికి పరిచర్య చేస్తున్నంతసేపు యెంతో నమ్రతగలిగిన మంచి మనిషిలాగానే ఉండేది. ఇది వరకటి పిచ్చికోపపు మనిషిలాగే కాన్పించలేదు. టాము ఆమె వంక చూచాడు. ఆతని హృదయము ఆమెకోసము బాధ పడేది. తనంతటి బాధలో మునిగికూడా టాము "అయ్యో నీవు భగవద్భక్తి అలవరచుకో దేవుడు నీకు మేలు చేస్తాడు" అన్నాడు.

నేనుకూడ భగవంతునిగూర్చి అలాగే అనుకున్నాను. కాని ఇప్పుడది లాభములేదు. ఆయన ఈ ప్రదేశములో ఉండడు. ఇక్కడ దుర్మార్గము నిస్పృహా తప్ప వేరేమి ఉండ టానికి వీలులేదు.

టాము మళ్ళి మాట్లాడటానికి తల యెత్తెను. కాని ఆమె వద్దని వారించెను. "దురదృష్టవంతుడవు అయ్యో పాపము యెక్కువగా మాట్లాడవద్దు, నిద్రపోవటానికి ప్రయత్నించు" అన్నది కేసీ.

—:o:—

# 21

లిగ్రీ చావిడి చాలా పెద్దది. కాని దీనిని గూడ ఆ మిగిలిన ఇళ్లులాగానే యెవ్వరు గమనించి చూచేవారు గాదు. టాముకు అలా శిక్ష విధించి లిగ్రీ ఈ గదిలోనికి వెళ్ళి నిప్పు దగ్గర కూర్చుని సారా త్రాగుతూ ఉన్నాడు. గ్లాసులో సారా పోసికొని లోలోపల గొణుగుకొను చున్నాడు.

"శంభోలాగనే గిల్లి పోట్లాట పెట్టుకున్న ఆ టాము వారము రోజులవరకు లేవనేలేవడు. పోతే ఈ తరు ణములోనే సంవత్సరములోకల్లా పనెక్కువ" అనుకుంటు న్నాడు లిగ్రీ. ఆతనికి తన కుర్చీ యెడమ్మవైపునుంచి "అవును నీలాగనె" అన్న గొంతుక వినవచ్చినది.

అది కేసీ. ఆమె నిదానముగా వెనకనుండి వచ్చుటచేత లిగ్రీ గమనించనె లేదు.

"సైమనులిగ్రీ జాగ్రత్త" అన్నది. ఆమె కన్నులనుండి కోపాగ్నిజ్వాలలు వెలువడినవి. ఆమె వంగి ఆతని చెవులో గుసగుసలాడినది. "నేనంటే నీకు భయముగదూ, అవును నీవు భయపడాలి. జాగ్రత్త నన్ను దయ్యము పట్టినది."

"ఛా" అన్నాడు ఆమెను త్రోసివేస్తూ "అది నిజమె అది నన్మోటల్లే ఉన్నదిలె" అన్నాడు లిగ్రీ. కేసీ అయిదు సంవత్సరాలు లిగ్రీతో స్నేహముచేసి నిదానముగా ఆతనిపై అధికారము సంపాదించినది. తాను పడిన బాధవల్ల ఒకప్పుడు పిచ్చెక్కినట్లుండేది. లిగ్రీకూడ ఇది పిచ్చిదై పోతుందేమో నని భయపడేవాడు.

"నిజంగా నాదే తెలివితక్కువ ఇవాళ ఆ పోట్లాట వేసుకోవటము, కాని వాడిని లొంగదీయాల్సిందే" అన్నాడు లిగ్రీ.

"నేను వాడిని లొంగదీయలేనట; నేను లొంగదీయ లేనా! యెముకలు విరుగగొట్టుతా, లొంగకేమి చేస్తాడో చూస్తాను" అన్నాడు ఆ లిగ్రీ. అప్పుడే శంభో ప్రవేశించి నాడు. కేసీ టాముకు ఉపచారము చేయడానికి పోయినది. లిగ్రీ ఒంటరిగా ఉన్నాడు. కేసీ అన్నమాటలకు కొంచెము భయపడ్డాడు. వాడికి పట్టిన బాధల్లా టాము పనిలోకి రాకుండా పోయినాడే అనేదే. తన మనస్సును కుదటపరచు కోటానికని అక్కడున్న శంభోతో కాస్త క్వింబోను పిలుచుకురమ్మని చెప్పినాడు. కొన్ని సారాసీసాలను తెచ్చి ఇట్ట త్రాగేశాడు. కేసీ తిరిగి ఇంటిలోకి తిరిగి రాగానే, వీళ్ళంతా పాటలు పాడుచు ఎగురుతు ఆ చావడిఅంతా కుక్కలు గూడ చూచి భయపడి పారిపోయేటట్లు చేసివేశారు. కేసీ వాళ్ళనుచూచి అసహ్యించుకొని మేడమీదనున్న తన గదిలోనికి వెళ్ళి పోయినది.

ఆ మరునాడు కేసీ చావడిలోనికి వచ్చేటప్పటికి లిగ్రి నేలమీద తప్పత్రాగి పడిఉన్నాడు. నిద్రలేచి ఒక గ్లాసు బ్రాందీ తీసికొని ఆసక్తితో త్రాగాడు.

"నేను నీకొక సలహా ఇవ్వాలనుకున్నాను" అన్నది కేసీ ఇల్లు ఊడుస్తూ "నీవు టాముజోలి వదలిపెట్టు."

"ఆసంగతి నీకెందుకే?"

"ఎందుకు లేదు తెలుసుకుందామని. పన్నెండువందల డాలర్లు పెట్టుకొని నీవు ఈ తరుణములో, యెక్కువపని ఉన్నపుడే నీకు నిరుపయోగ మయ్యేటట్లు చేసుకున్నావే అలా చావ చితక పాడిస్తే నాకెందుకా. సరే నీకేమీ పట్టదులే నాకెందుకు, నేను చేయాల్సింది చేస్తాను" అన్నది కేసీ.

"అది నీవు చేశావా అయితే నా పనిలో నీ వెందుకు కలుగచేసుకుంటున్నావు."

"ఆ నీకింత డబ్బు ఆదాచేద్దామని. అంటే ఇప్పుడు నీకు ఈ పంటలో నష్టమైనా ఫరవాలేదన్న మాట, అదేనా?"

లిగ్రి పట్టుదల మనిషి. ఏమైనా సరే తన పొరుగు వారికంటె తన కెక్కువ పంట కావాలని కోరుకుంటాడు. ఆతనియందున్న ఈ లోపాన్ని కేసీ కనిపెట్టినది. ఆతనికె ఆతను చేసిన తెలివితక్కువను గుర్తుకు తెచ్చినది. అవసర మైనపుడె తెలివితక్కువగా, టాము నెయొక్క సహాయము

నిరుపయోగము చేసుకొన్నానే అన్న బాధను లిగ్రీకి గల్గించింది.

"సరె ఇంకా వాడినేమీ చేయకుండా వదలివేస్తాను. కాని తప్పు వాడిదని ఒప్పుకోవాలి" అన్నాడు లిగ్రీ.

"ఆ పని అతనెప్పుడు చేయడు. యెందుకంటె తనది న్యాయమైనదని ఆతనికి తెలుసు. ఇలాంటి వ్యక్తుల తత్త్వము నీకు తెలియదు. సైమను, నీవు అతనిని చంపి తేగలవేమో గాని, ఆ మనిషి తత్త్వమును నీవు మార్చలేవు.

సూర్యుడు పొద్దుపైకి వచ్చేదాక టాము ఆతని ముతక చాపమీదనే పడుకున్నాడు. ఆతను ఈ రోజే తన చివరి రోజనుకున్నాడు. పోనీ దానివల్లనైనా ఈ బాధా వ్యధనుంచి విముక్తి పొంది భగవంతుని సన్నిధిని ఇంత ఆత్మసుఖము పొందవచ్చునుగదా అనుకున్నాడు. అందుకే లిగ్రీ తన గదిలోనికి వచ్చినా కూడ భయపడలేదు.

లిగ్రీ ఒక తన్ను టామును తన్ని "ఏరా, యెలా వున్నావురా! నాకే నీతులు చెప్పబోతావురా, రారా యేమిటా యన్యాయము చెప్పు చెప్పరా నాకు?."

టాము యేమీ జవాబు చెప్పలేదు.

"లేరా గాడ్దు" అన్నాడు లిగ్రీ తన్నుతూ. టాము

అతి కష్టముమీద, మహా ప్రయత్నముమీద కూర్చొని నిలవ బోయాడు.

"మోకాళ్ళమీద నిలుచబడి నన్ను క్షమించమని వేడు కోరా."

టాము కదలలేదు.

"పడు కుక్కా" లిగ్రీ కొరడాతో కొట్టుతూ అన్నాడు.

"లిగ్రీగారు నేనదియటుకు చేయలేను. నేను న్యాయ మైనది చేశాను. నేను మళ్ళీ అదే చేస్తాను. నేను ఇతరులకు కీడ గల్గించేది చేయను. ఏదైతే అదౌతుంది" అన్నాడు టాము.

"సరే ఇదిగో టాము, నీకేం జరుగుతుందో నీకు తెలి యదు. నిన్ను చెట్టుకు కట్టేసి చుట్టూ మంటబెట్టితే యెలా గుంటుందిరా? ఆ అది సుఖముగా ఉంటుందిరా?— ఏరా టాం మాట్లాడవేం?."

"అయ్యా మీరేమి భయంకర బాధలు పెట్టినా, మీరునన్ను చంపాక ఇంకా యేమీ చేయలేరు గదా. ఆహా ఆ తరువాత ఆజన్మాంతర జీవితముగదా, చిర నిరంతర ప్రశాంతిని భగవంతుని సన్నిధని ఆనందిస్తూ జీవించగలను గదా. లిగ్రీగారు మీరునన్ను వదలిపెట్టుతారా నేను మీకొక్క నమ్మకమైన సేవకుడనై ఉంటాను. ఈ నాలెక్కల కష్టము మీకు ఘోర

బోస్తాను. కాని నా ఆత్మను మీరు పొందలేరు. మీరు నన్ను నాశనము చేయలేరు. కాని నేను చావునకు భయపడుట లేదు. మీరు నన్ను కొరడాతో కొట్టవచ్చు, తిండి పెట్టక మాడ్చి చంపవచ్చు, మోదవచ్చు కాని ఇదంతా కూడ నేను పోదలచుకున్న చోటికి ఇంకా త్వరగా చేసుస్తుంది. నా కొచ్చే సహాయము నాకు వస్తుంది" అన్నాడు.

"యే దయ్యము నీకు సహాయము చేస్తుందిరా" అన్నాడు లిగ్రీ.

"సర్వశక్తివంతుడైన ఆ భగవంతుడే" అన్నాడు. అప్పుడు కేసీ లిగ్రివెంట ఆ పాకలోనికి వచ్చినది.

"తెలివి తక్కువకు పోకు" అని లిగ్రీని ఫ్రెంచి భాషలో ఆమె మందలించినది. "వాడిని నాకు వదలివేయి. నేను నీకు పనికివచ్చేటట్లు నేను చేస్తానుగా" అన్నది.

"సరె నీ ఇష్టప్రకారమే కానియ్యి" అని కేసీతో అన్నాడు టామునంక తిరిగి "నీ సంగతి పట్టుతాను. కాని ఇప్పుడు కాదులే. ఎందుకంటె ఇప్పుడు నలుగురు తలా నాలుగు చేతులువేసి పని పూర్తిచేయాలి. ఇదిగో నేను నీకు చెబుతున్నాను. నేను చస్తే మరచిపోను." అని లిగ్రీ వెళ్ళి పోయాడు.

"అయ్యో దురదృష్టుడా" అన్నది కేసీ "నీకెలాఉన్నది. వాడికున్న కోపమంతా నీమీదనే చూపిస్తాడని గుర్తుంచుకో ఆ మనిషిని నే నెరుగుదును."

# 22

టామును ఆతని క్రూరయజమాని బారికి వదలివేసి మనము జార్జి ఎలిజాల సంగతిని గమనిద్దాము.

స్నేహితుల చేతనే వదలివేయబడిన ఆ మనిషి ఒక క్వాకర్ల గృహములో (మిత్రమండలికి చెందినవారు) సుఖముగా ఉపచారములు పొందుచున్నాడు. ఆ దెబ్బ తిన్న వ్యక్తి పేరు మిస్టరు లోకరు. లోకరుకు ఒక క్వాకరు స్త్రీ అతనిదివరకు జన్మలో యెరగని రీతిగా ఉపచారములు చేస్తున్నది. ఆమె ఉపచారములవల్ల ఆతను శారీరకముగా కోలుకొనుటయే గాకుండా ఆతని ఆత్మప్రవృత్తి చిత్తవృత్తియే మారిపోయినది.

"నా స్నేహితులె నాకిల్లా చేసినపుడు, నేను పాపము ఆ పారిపోయివచ్చిన బానిసలకు తగిన సాయము చేస్తాను. వారక్కడనుండి యెంత త్వరగా పారిపోతే అంతమంచిది. వాళ్లు ఈ సరోవర ప్రదేశాన్ని సాధ్యమైనంత త్వరగా దాటివెళ్ళిపోవాలి. కాని దానికి వారు తమ స్వరూపాలను మార్చుకోవాలి. ఎందుకంటె పోలీసులకు వారి వర్ణనలు యజమానులిచ్చేశారు; వాళ్ళు వీళ్ళ కోసము వెదుకుతూ ఉంటారు" అని ఆ లోకరు వారిని హెచ్చరించాడు.

అతనిచ్చిన ఈ హెచ్చరికవల్ల వాళ్ళు రెండు భాగా లుగా చీలిపోదామనుకున్నారు. వారిలో వారు, జీము అనే నీగ్రో ఆతని తల్లి ఒక భాగముగాను, జార్జి ఎలిజా హేరీలు ఇంకొక భాగముగాను విడిపోయి ఎల్లాగైనా ఆ ఐరీ సరస్సును చేరాలనుకున్నారు. ఆ సరోవరము మధ్యగా కెనడా రాష్ట్రపు సరిహద్దు పోతున్నది. వారు కెనడాపోయే పడవలో ప్రయా ణముచేసి బానిసత్వ బాధయే లేని స్వతంత్ర దేశమగు కెనడా దేశము చేరనిశ్చయించిరి. ఆ దేశము గనుక వారు చేరితే వారు సుఖజీవితము గడపినట్లె. అక్కడ వారు చేతనైన బ్రతుకు తెరువు చూచుకోవచ్చును. తమ స్వంత ఇల్లు కట్టుకోవచ్చును. భర్త భార్యను తన దానినిగా యెంచ వచ్చును. భార్య కలకాలము భర్తతోనే ఉండిపోవచ్చును. భార్యా భర్తలు ప్రేమతో సంతానమును సరిదిద్దుకోవచ్చును. మళ్ళీ బానిసత్వములోనికి ఈడ్వబడుతామన్న భయముండదు. స్వాతంత్ర్యాన్ని గూర్చిన ఈ భావనే జార్జికి ఆ క్వాకర్ల గృహములో ఎలిజా సరసన కూర్చున్నపుడు గల్గినది. వారు మారువేషాలతో ప్రయాణముచేయ నిశ్చయించు కున్నారు. దయామయురాలైన మిసెస్ స్మిత్ అనే కెనడా దేశపు స్త్రీ పిల్లతోపాటు ప్రయాణము చేయుటకు అంగీక రించినది. ఆమె హేరీ పెత్తల్లిగా ఉంటానన్నది. హేరీకి ఆడ పిల్లవేషము వేశారు. ఆ మిసెస్ స్మిత్ రెండు రోజుల నుండి ఆ క్వాకర్ల గృహములోనే ఆ పిల్లవానిని మచ్చిక చేసుకున్నది. ఎలిజా ఒక యువకుని వలె మారువేషము

ధరిస్తుంది. ఇక జార్జి ఒక ముసలివాని వేషము వేసుకునే టట్లు నిర్ణయింపబడినది.

ఎలిజాకు జుత్తు కత్తిరించారు. ఆతనికి ఒక యువకుని బట్టలు దీసుకువచ్చారు. జార్జి ఆమెను ఆ బట్టలు వేసుకోమన్నాడు.

ఓ ఎలిజా నేడు మనకు విముదలయ్యే ఘడియ దగ్గరకు వచ్చింది. ఇది ఇప్పుడు మనము పోగొట్టుకుంటె, ఇహ నాకు జీవితానందమె పోతుంది.

"భయపడనద్దు" అని నమ్మకముతో ఎలిజా అన్నది.

"భగవంతుడే సాయము చేస్తాడు" అని నాకు తప్పక నమ్మకమున్నది. నేను ఆయనను నాతోనే ఉన్నట్లు భావిస్తున్నాను. ఈనాడే భగవంతుడు నాకు విముదల ప్రసాదిస్తాడు".

"నాకుకూడ అదే నమ్మకము. చూడు ఈటోపీ ఈ కోటు ఇలా పెట్టుకోవాలి" అని జార్జి నిలుచొని అన్నాడు "నీవు అందమైన బాలుడవుగా ఉన్నావు."

అప్పుడే మిసెస్ స్మిత్ ప్రవేశించినది. "వాళ్ళు పోలీసులకు ఇదివరకే చెప్పి ఉంచారట సరస్సులో పడవల మీదుగా ఒక స్త్రీని మనిషిని చిన్నపిల్లవానిని దాటేయవద్దని ఆజ్ఞలిచ్చారుట" అన్నది.

"సరే మనము వాళ్ళని తప్పించుకు పోగలమేమో చూడాలి" అన్నాడు జార్జి.

అందరు పెట్టె బేడ సర్దుకొని ఆ సరస్సు గట్టునకు చేరారు. మిసెస్‌స్మిత్ ఆ ఆడపిల్లయగు హెర్రీ చేతిని పట్టుకున్నది. ఎలిజా ఒక నవయువకునివలె ఉన్నాడు. అతను ఆ మిసెస్‌స్మిత్‌ను పడవ యెక్కుటకు సహాయము చేశాడు. జార్జి వీరి వెనుకనే సామానుగట్రా తీసుకొని వస్తున్నాడు.

ఎండ ఫెడేలున కాస్తున్నది. సూర్యుడు నీలి తరంగాలపై ఉజ్వలముగా ఉన్నాడు. ఇంతలో గంట కొట్టారు. ఇంజను మీటనొక్కారు. అంతా అవతలి గట్టుకు చేరబోతున్నారు పడవ ఆగినది. ఆ కొద్దిమంది ప్రయాణీకులు అవతల గట్టున దిగారు. పడవ సాగిపోయినది. అక్కడ ఆకెనడా సరిహద్దులలో సుఖముగా దిగినందుకు జార్జి ఎలిజా హేరీలు ఆ చక్కల రేవుమీద నుండే ఆ భగవంతునకు నమస్కారము చేసిరి.

మిసెస్‌స్మిత్ వాళ్ళను ఒక క్రైస్తవ ఉపాధ్యాయుని వద్దకు తీసుకుపోయినది. అక్కడ వాళ్ళు కొన్నాళ్ళున్నారు. వారలవద్ద డబ్బులేదు. చేతిలో పని లేదు, ఇల్లులేదు. ఈ లోకములో నాదిఅనే దేమీ లేదు. ఆ ఆకాశాన విహరించే పక్షులవలె ఆ అడవినగాసిన పూలవలె ఉన్నారు. కాని తాము స్వతంత్రుల మయ్యాముగదా అన్న ఆనందముతో, ఆ రాత్రెల్లా వారికి నిద్ర పట్టనేలేదు.

లిగ్రీ యెదురుపడ్డప్పుడల్లా టాముకు తనకు జీవితావసాన ఘడియలు సమీపించినవని యెరిగి యెంతో సాహసముతో ధైర్యముతో జవాబు చెప్పేశేవాడు. కొద్దిలోనే స్వర్గ సౌఖ్యము, ఆ భగవంతుని సన్నిధి వస్తుందిగదాయని, జీససు ప్రభువు కృపవల్ల తన ఈ భౌతికకష్టాలు కలకాలము నిలిచి ఉండవుగదా అనుకొనెను.

కాని టాము చావలేదు. కొద్దికొద్దిగా తనకు వాడు చేసిన దౌష్ట్యమునుండి కోలుకొంటున్నాడు. కాని అతను పూర్తిగా కోలుకోకపూర్వమే పొలములో పనిచేయుటకుగాను పంపివేయబడ్డాడు. రోజురోజుకు బాధ తిట్లు అమర్యాద పీడించుట లిగ్రీవల్ల యెక్కువైనవి. టామునొక్క అంతఃకరణ గూడ పీడింపబడి ఈ కష్టాల పరంపరను భరింపలేక పోయినది. టాము రోజుపని యైపోగానే, ఆ నిప్పుసెగ కాంతిలో బైబిలుగీతాలు చదువుకోటానికి ప్రయత్నము చేయగానే, ఆతనికి తలనొప్పి పుట్టేది; కళ్ళు తిరుగుటవల్ల చదువుకోలేక పోయేవాడు. భగవద్విశ్వాసము గల టామునకుగూడ, దుర్మార్గమే బలవత్తరమైనదనియు, అదే విజయవంతమయ్యేదనియు, భగవంతుడుగూడ నిమిత్తమాత్రుడై మౌనముదాల్చునని తెలుసుకున్నాడు. టాము ఆ ఒఫీలియా ఆ కెంటకీలోన

షెల్బీపతి గారికి వ్రాసిన లేఖనుగూర్చి ఆశలు పెట్టుకొని రోజు రోజు వేచియున్నాడు; ఏమైనా సహాయము వస్తుందేమో అని. షెల్బీపతి వాగ్దానప్రకారము సహకారము వస్తుందేమో అనుకున్నా యెవరు రాలేదు. ఒకొక్కప్పుడు ఆతనికి ఆ భగవంతుడే మరచిపోయినాడా అనే భావము గల్గుతుండేది.

ఒకనాటి సాయంకాలము నిప్పుసెగ కాంతిలో టాము బైబిలు చదివే ప్రయత్నములో ఉండగా లిగ్రి వచ్చి నిలుచున్నాడు. "అరేయి ఇక్కడ నీమతము పనిచేయదు. అదంతా వదలిపెట్టి చెప్పినదిచేయి" అన్నాడు. "అరేయి క్రోంబో, శంభోలకన్న నీకొ మంచిపనే చెప్పేవాడినిరా. ఆ పాడు పుస్తకాన్ని మంటలో పారేయ్. దేవుడు నీకు సహాయము చేయడురా. ఆ దేముడే నిన్ను నా గుప్పెటలో పెట్టలేదూ. ఇదిగో నీకిష్టముంటే నేనే నీకు సహాయము చేయగలను" అన్నాడా లిగ్రి.

ప్రేమబాబూ నేనాభగవంతునే అంటిపెట్టుకొనిఉంటాను. ఆయన సాయము చేసినాసరే, చేయకపోయినాసరే నేనాయనను వదలిపెట్టను. కొనఊపిరి ఉండేవరకు ఆయన్నే నమ్ముకున్నాను, నమ్ముకుంటాను" అన్నాడు టాము.

"నీవు మూర్ఖుడవురా తెలివితక్కువ వెధవా" అన్నాడు లిగ్రీ తన్నుతూ. నేను నిన్ను లొంగదీస్తానురా—నీవె చూస్తావుగా."

అని లిగ్రి వెళ్ళిపోయాడు. టాము ఆ నిప్పువంక చూస్తూ కూర్చున్నాడు. మనస్సులో ఆలోచన పోవటము లేదు. ఆశపడటానికికూడ ఆశ లేకుండా పోయినది. అంతటి అధోగతికి ఈడ్చుకొనిపోవు నిస్పృహనుండి కూడ టాము మహా మనోనిబ్బరముతో మనస్సును త్రిప్పుకొని ఆనందము ధైర్యము పొందుతున్నాడు. ఆ అలా కూర్చొని నిప్పువంక చూస్తూఉండగా టాము తన చుట్టుప్రక్కల యేమున్నదో గమనించలేదు. కాని తన వంక యేదో ముఖము చూస్తున్నట్లు గోచరించినది. అది స్పష్టముగా ఆయన ముఖమె ముళ్ళకంచెచేత పీడింపబడిన యేసుప్రభువు ముఖమువలె గాన్పించినది. ఆయన కళ్ళు బాధతో గప్పియున్నవి. అయినా ఓప్పుచేత మిక్కిలిగా ప్రకాశిస్తూ ఉన్నవి. ఆ రెండు కళ్ళు టాము హృదయాన్ని ఆకర్షిస్తున్నవి. తన చేతులను టాము పైకెత్తాడు. మోకాళ్ళమీద పడ్డాడు, వెనువెంటనే ఆ దృశ్యము అదృశ్యమయ్యెను. ఒక అద్భుతకాంతి వలయములో ఆ ముఖమే ప్రేమ దాక్షిణ్య భావముతో ఆతనివైపు వంగినట్లు కన్పించినది. "విజయము పొందినవారు నా ప్రక్కనే నా సింహాసనమునే అర్ధాసనము పొందుదురు; నేను కూడ అల్లాగే విజయము పొందినా తండ్రి ప్రక్కన స్వర్గ సింహాసనమున అర్ధాసనము పొందితి" అన్న శబ్దము వినిపించినట్లు టాముకు తోచినది.

టాము చాలసేపు నేలమీదనే పడుకున్నాడు. ఆ క్షణమునుండి ఆతడు శాంతత పొందెను. ఆ ప్రశాంతతను

యేది భేదించలేకపోయెను. అవసానకాలము సమీపిస్తున్న కొలది తన కింక బాధ గల్గించేది లేదని ఆతని మనస్సుకు తోస్తున్నది. రాబోయే ఆ మహాస్వర్గము దాపునకు వచ్చే కొద్ది దానినుండి తనను దూరముచేసేదేది లేదని ఆతని మనస్సుకు తోస్తున్నది.

ప్రతివారు టాములో యేదో మార్పు వచ్చినట్లు గమనించారు. టాము యెప్పుడు సంతోషముగానే ఉండే వాడు. ఏది యేమైనా యెలా జరిగినా శాంతి ఆతనిని వెంట ఉన్నట్లే ఉండేది.

ఒక రాత్రిపూట లిగ్రీ ఇంటికి ఆలశ్యముగా వస్తూ ఉండగా యేదో పాట వినిపించినది. ఈ పాట తన నీగ్రోల వద్దనుండి రావడమువల్ల అది ఆతనికి అపూర్వ స్వరముగా తోచినది. దగ్గరకు వచ్చిన కొద్దీ ఆ కంఠధ్వని టాముదని టాము ఒక భక్తిగేయాన్ని పాడుతున్నాడని లిగ్రీ తెలుసు కున్నాడు. గుడిశబయట, ఇతరులను చుట్టూ కూర్చుండ బెట్టుకొని టాము గీతాలు పాడుటచూచి, లిగ్రీ వాని వైపుకు అమితము కోపడానికి ఆ పాటల నాపుచేసెను.

"ఏమండీ అయ్యగారు" అని టాము వెళ్ళిపోవ ప్రయత్నించాడు. కాని టాము గుడిసెలోకి వెళ్ళకపూర్వమే లిగ్రీ ఉరికి ఆతని భుజముమీద కొట్టెను. టాము నిశ్చలుడై నిలుచున్నాడు. అప్పుడు లిగ్రీ తన సేవకునిపై తనకు గల అధికారము పోయినట్లనిపించెను. తాను కొట్టే దెబ్బలు

ఆతని శరీరముమీదనే తగులుచున్నట్లు టామునొక్క మాన సిక శరీరముపైన అంతఃశరీరముపైన యేమీ తగలనట్లుగానే లిగ్రీకి తోచెను. టాము తన గుడిసెలోనికి పోవుచుండగా, తనకు తన బారిపడిన నిర్భాగ్యునకు మధ్య భగవంతుడున్నా డన్న భావము సుస్పష్టముగా లిగ్రీకి వ్యక్తమాయెను. లిగ్రీ భగవంతుని నామరూపమునే తిట్టెను. కాని టాము హృద యము తన చుట్టు ఉన్నవారిపై దయాప్రేమలతో పూర్తిగా నిండుకున్నదాయెను. ఎవరన్నా జబ్బుపడితే టాము వెళ్ళి చూచేవాడు. ఎవరికైనా దుఃఖమువస్తే టాము ఆదుకునే వాడు. ఎవరైనా నిస్పృహతో కృంగిపోతుంటే టాము చూచి ధైర్యము చెప్పేవాడు. సహాయము కోరితే యెప్పుడు సహకారము చేసేవాడు. కాని అతను యెవరిని తనకు సహాయము చేయుమని కోరేవాడుగాదు. ఇలా ఇతరులపై తన పలుకుబడిని పెంపుచేసుకున్నాడు. తను సామాన్య ముగా మంచిచేద్దామనుకొని చేసేవాడు. అంతే అది ఆ దుర్మార్గ భూయిష్ట పరిదేశములో అదే మహాశక్తియై ముందుకు నడిచేది. కొంతకాల మయ్యేటప్పటికి కొందరు ఆతనివద్దనుండి జీసను కథలు తెలుసుకోవడానికి వచ్చేవారు. ఇంకా ప్రార్థనలకు రావటానికికూడ ఇష్టపడ్డారు, కాని లిగ్రీ అటువంటిదేమీ జరగనీయలేదు,

ఒక రాత్రివేళ టాము యేదో ఒక పిలుపువిని లేచి కూర్చున్నాడు. గుడిసె బయటకు వచ్చిచూడగా, ఆతనిని కేసీ సైగచేసి పిలిచినది. ఆమె కళ్ళలో పిచ్చిదానియొక్క

నెత్తిచూపులు కన్పించినవి. అది భయంకరముగా ఇలా చెవులో గుసగుస లాడినది.

“అంకులుటాము ఈనాడు మనము స్వాతంత్ర్యము పొందబోవు తున్నాము. -రా-చూడు - వాడికి - నేను బాగా బ్రాందీని త్రాగించాను-ఇహ లేవడు-ఇంటికి తాళముపెట్టాను-గొడ్డలి అక్కడే ఉన్నది. -వాడిగది తలుపు తెరచే ఉన్నది-నా అంతట నేనే చేసేసే దానను-కాని యేదీ నాదగ్గర బలము లేదు” అన్నది కేసీ.

టాము “తప్పు తప్పు. దుర్మార్గమునుండి సత్ఫలితము లెప్పటికి గలుగవు” అన్నాడు. “అయితే యేదీ నేనే చేస్తా” నన్నది కేసీ. ఆ ఇంటివైపుకు తిరుగుతూ, “నాకేమి జరుగుతుందా అనే భయము లేదు. ఇతరులకోసము వానిని నేనే చంపుతాను” అన్నది కేసీ.

“తప్పు తప్పు” అని టాము ఆ ఇంటినుండి కేసీని లాగి వేశాడు. “ఆ భగవంతుడే, తన విరోధులను తన కపకారము చేయనిచ్చి, చివరకు తనను శిలువ వేయనిచ్చారు,” తాను చిందించిన రక్తము తన శరీరము లోనిదేగదా. ఆయన విరోధుల మైన మనకోసమె ఆయన తన శరీరరక్తమును కార్చారు. ప్రభూ నిన్ననుసరించుటకు మాకు శక్తి ప్రసాదించు, మా విరోధులను కూడ ప్రేమించే హృదయమియ్యి. చూచావా అమ్మా ఆ విజయమె ఆయన మనకు ప్రసాదించినాడు — అది

విజయనే అమ్మాయి ఇట్లాంటివాళ్ళను ప్రేమించటముగూడ. దేముడే జయిస్తాడు విజయనే ఆయనది. అదే జయము.

టాముయొక్క హృదయ వేదన భక్త్యావేశము కేసీని కదల్చినది. ఆతని మంచితనము, ఆతని నమ్మకము ఆమె యొక్క క్రూరమైన శిలా హృదయమును గూడ మెత్తబరచి నది. కేసీ నిశ్చలమై నిలుచున్నది. "కేసీ" అన్నాడుటాము "నేను ఎమిలిసీకి ఒకసలహా ఇస్తున్నాను. మీ రిక్కడనుండీ వెళ్ళిపోండి యెంత త్వరగా వెళ్ళిపోన వీలైతే అంత త్వరగా, ఈ ప్రదేశాన్ని విడిచిపోండి".

దానివల్ల యేమిలాభము, వాడు తన కుక్కలతో వేటాడుతాడు. మమ్మల్ని నీళ్ళలో ముంచి ఉక్కిరి బిక్కిరి చేసి చంపుతాడు. మరి నే మెక్కడికి పోతాము.

టాము చాలకాలము ఆలోచించాడు. చివరకు "భగ వంతుడు తన పిల్లలను అనేక పర్యాయములు రక్షించారు. ఆయనకృప ఇంకా నాకు తెలుసు. ఆయన మిమ్మల్ని రక్షిస్తాడు. మీ ప్రయత్నము మీరు చేయండి. నేను మీ కోసము ప్రార్థన చేస్తాను" అన్నాడు టాము.

శిలాకాఠిన్యమైన కేసీ హృదయము టాముయొక్క ప్రేమ నమ్మకములకు కరగి మార్గమైనది. ఆమెకు ఒక

ఆలోచన, ఒక యెత్తు తట్టినది. దానివల్ల పారిపోవచ్చుననే ఆశ ఆమెకు కలిగినది.

"అంకులుటామ సరే నేను ప్రయత్నిస్తాను" అని హఠాత్తుగా అన్నది.

"భగవంతుడు నీకు మేలు చేయుగాక" అన్నాడుటామ.

# 24

కేసీ వేసుకున్న ఎత్తేమిటంటే లిగ్రి యొక్క మూఢ నమ్మకాలను తానుపయోగించు కోవాలను కున్నది. ఆ పాత ఇంటిమేడ మీదనే ఒకగది ఉన్నది. ఆ గదిలో నిరుపయోగ మైన వస్తువులు అనవసరమైనవి తుప్పుపట్టినవి వేసి తాళము వేసేవారు. ఏనాడో కొన్ని సంవత్సరాల క్రితము లిగ్రి ఒక నీగ్రోస్త్రీపై కోపముచేత ఆగదిలో పెట్టి వారాలపాటు తాళము వేసి, తరువాత ఆమె శరీరాన్ని తీసుకువచ్చి పూడ్చి వేశాడు. ఆ తరువాత పనివాళ్ళందరు ఏవో విపరీతశబ్దాలు వినవస్తున్నాయని ఏడుపులు వినిపిస్తున్నాయని అనేవారు. ఈ మాటలు లిగ్రికి యెంతో కోపాన్ని గల్గించేవి. లిగ్రీ కోప ముతో ఇల్లాంటికథలు ఎవరైతే చెబుతారో వారిని ఆ గది లోనే పెట్టి తాళము వేస్తానని అన్నాడు. అప్పటినుండి ఆ

మాటలు అనుకోనటము తగ్గినది, కాని ఎవరు ఆ గది దాపు నకు పోలేదు. కేసీ లిగ్రీయొక్క ఈభయాన్ని తన లాభానికి ఉపయోగించుకోవాలనుకున్నది.

కేసీ పడకగది, ఆ మేడమీద గది క్రిందనె ఉన్నది. ఒకరోజున పనివాళ్ళను పిలిచి తన పడకగదిలోని సామాను యావత్తు దూరానవున్న ఇంకొక గదిలోనికి మార్చివేసినది. ఆమె లిగ్రీని ఈవిషయమై సంప్రతించలేదు. లిగ్రీ వచ్చి ఇది యెరిగి, ఈ మార్పుకు ఆశ్చర్యపడ్డాడు.

"ఏమిటి యెందుకిలా మార్చేశావు" అని అడిగాడు. "కారణమేమీలేదు. నాకింకొక గది కావాలనె."

"ఏమిటి నీ కేదైనా దయ్యము పట్టినదా" అన్నాడు.

"కాస్త రాత్రిళ్లు నేను నిద్రపోవాలా వద్దా"

"ఏమిటి నీవు నిద్రపోవడానికి ఏమి అడ్డంకి వచ్చింది."

"ఆ ఏమీలేదు. నీకేమీ నిద్రాభంగము కలుగ లేదా. రాత్రిపూట ఆ గది నుండి యేడుపులు శబ్దాలు ఊరికే వినవస్తుంటె" అన్నది కేసీ.

"ఏమిటి" అన్నాడు లిగ్రీ తెప్పించుకున్న నవ్వుతో "ఎవరున్నారే కేసీ". కేసీ ఆతనివంక చూచినది. దానిచూపె ఆతనిని ఆందోళన పెట్టినది.

"ఎవరున్నారురా అక్కడ? అది నీవే నాకు చెప్పగలవు సైమను."

లిగ్రి అనేక శపథాలు పలికాడు. కేసీని కొట్ట బోయాడు. కేసీ ఆతనిని తప్పించుకొని తన గదిలోనికి వెళ్ళి పోయినది, వెనుతిరిగి "నీవు ఆ గదిలో యెందుకు పడుకోవు సైమను? అప్పుడు నీకంతా తెలిసివస్తుందిగా" అన్నది.

కేసీ తను ఆతనిని భయపెట్టాననుకున్నది. ఇహ తను నిర్ణయించిన ప్రకారము చేస్తున్నది. ఆ పైగది తొఱ్ఱలో ఒక పగిలిన గాజుసీసా పెట్టినది. దానివల్ల కొద్దిగా గాలి వీచినపుడెల్ల యొక ఏడుపు శబ్దము వినవస్తుండేది. చాల మాసులు పనివారు ఇదే శబ్దము విన్నారు. ఇహ ఒకొక్కరే దెయ్యాలని కథలు కథలుగా చెప్పుకునేవారు. ప్రతివారు ఆ గదిదగ్గరకు పోవటానికే భయపడేవారు. ఈ భయము లిగ్రీనికూడ పట్టుకున్నది. అంతేకాక ఆతనికి కేసీ అంటేనే అసలు భయము. అది బానిసయైయైనా దానికి ఆతనిపై గల పలుకుబడివల్ల దానిలో ఉధృతమవుతున్న వెఱ్ఱిచూపులనుచూచి లిగ్రి భయపడేవాడు. కేసీ చిన్న చిన్న విసురులవల్ల, కట్టుకథలవల్ల ఆతనికి ఆగది అంటేనే హడలెత్తేటట్లు చేసినది. అందుచేతనే తన బానిసలు నమ్మే మూఢనమ్మకాలను లిగ్రికూడ నమ్మేశాడు. ఈ లోపల కేసీ ఆ గదిలోకి తనకు ఎమిలినీకి కావలసినంత బట్టలు ఆహారము అంతా చేరవేస్తున్నది. అక్కడే పడుకోటానికి ఓ పక్క, కొవ్వ

త్తులు, కొన్ని వారాలవరకు సరిపోయే ఆహారాది సామగ్రి అంతా పేర్చిపెట్టింది.

చివరకు కేసీ వేసుకున్న పథకములో రెండవ ఘట్టము చేయాల్సి వచ్చినది. ఒక రోజున లిగ్రీ యెక్కడికో బయటకు వెళ్ళాడు. కేసీ ఎమిలినీలు బయటకుపోయే దుస్తులు వేసుకొని ఆ రోడ్డు వెంబడే వెళ్ళారు. వాళ్ళు చేత్తో మూటలు తీసికొని వెళ్ళారు. ఇంకా సూర్యాస్తమయము గాలేదు. లిగ్రీగూడ వాళ్ళు వెళ్ళడము చూచాడు. ఇహ తక్షణమే సాంభో క్వింబోలను, తన కుక్కలను దీసికొని అంతా ఆపారి పోయిన వాళ్ళను వెతకటానికి వెళ్ళారు. ఈ లోగా కేసీ ఎమిలినీలు, కొన్ని మురికిగుంటలను నీటి జాలులను దాటిరి. నీటిలో నడచుటవల్ల కుక్కలు పసికట్టలేవు. ఆ జాలు వెంబడేపోయి మళ్ళీ తిరిగి ఇంటికి తిరిగివచ్చేశారు. కాని ఇలా తిరిగి రావటము యెవ్వరు గమనించలేదు. ఎందుకంటె అందరూ కుక్కలతోసహా వాళ్ళను వెతకటానికి వెళ్ళారు. వాళ్ళిద్దరె ఇంటిలోకి వెళ్ళారు. కేసీ లిగ్రీయొక్క తాళము చెవులు చూచినది. లిగ్రీయొక్క గల్లాపెట్టెనుదీసి అందులో నుండి నోట్లకట్టను దీసివేసినది. ఆ నోట్లు దీసికొని ఎమిలినీతో కలిసి, మేడమీది గదిలోనికిపోయి, ఆ విచిత్ర గృహమునే స్వగృహముగా భావించి, వారు దాక్కున్నారు. ఎమిలినీ ఇంత ధైర్యము గుండె నిబ్బరముతో నిలవలేక పోయినది.

"వాళ్ళు ఈ మేడమీంది గదిని వెతకరా!" అని అను మానముతో అడిగినది.

"సైమను లిగ్రీ ధైర్యముగా ఇక్కడకువస్తే చూడాలని నాకున్నది" అన్నది కేసీ. అది గాదులేవే వాడిక్కడ రాకుండా ఉండడానికే ప్రయత్నిస్తాడు, మనము గట్టిగా మాట్లాడుకున్నా తప్పలేదు; పోనీ వాళ్లు మన మాటలు వింటారంటావు అందువల్ల ఇక్కడకు రాకుండా మరీ దూరముగా పోతారు.

లిగ్రీ తన కుక్కలతోను శంభో క్వింబోలతోను, అదంతా వెతికించాడు. ఇతర పొలాలవారు గూడ వెతకడానికి సాయమునచ్చారు. ఇలాగునే కొన్ని రోజులపాటు వెదికారు. లిగ్రీ ఇహ నిరాశతో మానివేయ నిశ్చయించాడు.

లిగ్రీ ఇహ వెదకటము మానివేయ నిశ్చయించి "ఇదిగో క్వింబో నీవు వెళ్ళి టాముని తీసుకురారా. వాళ్ళెక్కడున్నారో వాడికి తెలుసుననే నా నమ్మకమురా, యెలాగో అలా అదంతా వాడిచేతనే చెప్పిస్తాను" అన్నాడు.

టాముకు ఇంకా కష్టము గలుగుతుందిగదా యని ఆ శంభో క్వింబోలు సంతోషించారు. కోపముతో లిగ్రీ టామును యెలా అసహ్యించుకుంటున్నాడో వాళ్లు కూడ అలాగే టాముయొక్క మంచి తనమునుచూచి అసహ్యించు

కునేవారు. ఆ టాము మంచితనమే వారలను యేదో నింది స్తున్నటులుగా తోచినది. టాము కేసీ వేసుకొన్న పథకము యెరుగును. అందుచేత వారెక్కడ దాకున్నారో అతనికి తెలుసు. టాము తన యజమాని క్రూరత్వమును గూడ బాగా యెరిగియే యున్నాడు. కాని భగవంతుడు తనకు నృతిపొందే బలసాహస ధైర్యాదుల ప్రసాదిస్తాడని అందు చేత ఆ నిరాశ్రియులను బయట పెట్టరా దనుకున్నాడు. ఆ శంభో క్వింబోలు టామును మొదటగా వారి యజమాని సద్దకు ఈడ్చుకు పోతున్నారు. అప్పుడు జీసను అన్నమాటలు టాము హృదయాంతర్గతమున వినిపించినవి. "శరీరాన్ని ఖండించె వారిని చూచి భయపడకు, అంతకు మించి వారెంకా చేసేదేమియు లేదు." టాముకు తనకు విముక్తి లభిస్తున్న దిగదా యని తోచింది. ఆ ఆనందమయ ధామము ఆతని దాపునే ఉన్నటుల తోచినది.

"అరే టాము" లిగ్రీ మహాకోపముతో "నిన్ను నేనేమి చేస్తానో తెలుసునురా, చంపేస్తాను" అన్నాడు.

"అదే అవుతుందేమో అయ్యా" అన్నాడు టాము మెల్లగా.

"చంపేస్తానురోయి చెప్పు ఆ ఇద్దరు ఆడపిల్లలు యెక్కడున్నారో చెప్పు." టాము మౌనము వహించాడు.

"చెప్పవేంరా" అన్నాడు. లిగ్రీ ఈడ్చి టామును కొట్టాడు.

"నీకు తెలుసా"

"నాకు తెలుసయ్యా కాని మీకు నేను చెప్పలేను. నేను చావవలసివస్తే చావగలను."

లిగ్రీ ఒక దీర్ఘ నిశ్వాసము దీసినాడు. టాము చేయి పుచ్చుకున్నాడు. తన ముఖము టామునకు దగ్గరగా పెట్టాడు. భయంకలిగ గొంతుతో నీకు చెబుతున్నాను. నేను నిశ్చయించేశాను, నీ వెప్పుడు నాకు వ్యతిరేకముగా ఉంటున్నావు. ఇప్పుడు లొంగివస్తావా చస్తావా నీ వంటి నుండి ప్రతి రక్తము బిందువు పిండుతూ, ఒక్కొక్క చుక్క చెప్పేవరకు కార్పిస్తా."

టాము యజమానివంక చూచి ఇలా అన్నాడు. "అయ్యా మీరు కష్టములో ఉన్నా, జబ్బుగా ఉన్నా ప్రాణా పాయమప్పుడైనా నా గుండె నెత్తురు కావాలన్నా చీల్చి ఇచ్చేవాడిని—నా కారిన రక్తమె మీ ఆత్మను రక్షింప గల్గితే, జీససు భగవానుడు తన రక్తాన్ని దాన మిచ్చినట్లుగా నేను నా రక్తాన్ని దానము చేస్తాను. అయ్యా మీరు మీ ఆత్మకు కష్టాలు గల్గించేది, మీకు ఆత్మ సుఖమియ్యని దేది చేయవద్దు, సాధువ్రతము చేయండి మీరు ఏది చేయా లనుకున్నారో అది చేయండి— నాకేమీ భయము లేదు. నా కష్టాలు దానితో తీరిపోతవి. కాని భగవంతుని శరణొం దకపోతే మీ కష్టాలెప్పటికి తీరనే తీరవు."

టాముపంక లిగ్రీ ఆశ్చర్యముతో చూచాడు. ఆతనికి ఏదో దైవప్రోద్భోధితమైనట్లు ఒక క్షణము సేపు గోచరించి నది. కాని లిగ్రీ దానిని వినలేదు. ఆతనిలోనున్న దురాత్మస్వరూపమే గెలువడి ఆతని విషహృదయాన్నే కోటగా చేసికొని, లిగ్రీని ఆ టాము నేలపై పడేటట్లు, కొట్టింప చేసెను.

టాము ఆ రాత్రి పడిన బాధ వర్ణింప వీలులేదు. ఆ క్రైస్తవ చర్చీలు ఆ దేశము అనుమతించిన ఆ సూత్రాలను ప్రశ్నించనైనా ప్రశ్నించలేదు. టాము అక్కడ యేకాకిగా లేడు; ఆయన వెనుకనే ఏసు ప్రభువున్నాడు. క్రౌర్యానికి దుర్మార్గానికి చిహ్నమైన సిలువను, ప్రేమ విజయచిహ్నముగా మార్చిన ఏసు ప్రభువున్నాడు. టాముకు తన ప్రక్కనే ఆ మురికి గుడిసెలోనే, దేవుని కుమారుడైన జీసను నిలువబడుట, టాముకు కనిపిస్తూనే యున్నది.

అనేక పర్యాయములు తన భక్తి మార్గమునుండి టాము చలితుడైన ఆతని విశ్వాసము సడలకుండా ఉండే శక్తి ఏసు ప్రసాదించినాడు. ఆ రాత్రి రాత్రల్లా క్రూరముగా పీడింపబడినా ఆతని నోట భగవత్సంకీర్తనమేగాని మారుమాట వచ్చేదిగాదు. శంభోవంటి పరమ క్రూరుడు గూడ తన బారిబడి బాధితుడైన టామును ఆతని ప్రశాంత తనుచూచి చకితుడైనాడు.

"ఇహ ఆతని పనైపోయింది అయ్యా" అన్నాడు.

"కానీరా ప్రతి ఒక్క రక్తపు బిందువు పిండరా" అన్నాడు లిగ్రి.

టాము కన్నెత్తి చూచాడు. "ఓసి ఇంతేనా, ఇంతేగా ఇంకా నీవేమి చేస్తావు గనుక. నా ఆత్మసాక్షిగా నిన్ను నేను క్షమిస్తాను. అని స్పృహతప్పి పడిపోయాడు" టాము.

లిగ్రి టాము చచ్చిపోయాడనుకొని ఆ పెడ్డు వదలి పెట్టి వెళ్ళిపోయాడు. కాని క్వింబో శంభోలు అక్కడనే ఉన్నారు. ఆతని మాటలు, ఆతని నిదానము, ఆతని భక్తి వారల శిలాకాఠిన్య క్రూరహృదయాలను కూడ కలచివేసినది. ఆతనిని బ్రతికించడానికి శాయశక్తుల ప్రయత్నిద్దామనుకున్నారు. అక్కడనే ఒక పక్క యేర్పాటు చేశారు. వాళ్ళే టాము గాయాలు కడిగారు.

"ఓ టాము మేము నీ యెడ యెంత నిర్దయగా ప్రవర్తించాము" అన్నాడు క్వింబో.

"టాము జీససు యెవరో, మాకు తెలియ చెప్పు" అన్నాడు శంభో. ఈ రాత్రిల్లా నీపక్కనే నిలుచున్న ఆయనెవరు చెప్పవూ అన్నాడు శంభో.

ఆ ప్రశ్న టామునెయొక్క అలసి సొలసిన ఆత్మకు శైత్యోపచారములు చేసినట్లయినది. అది ఆతని ఆత్మను ప్రబోధించినది. టామ కొద్ది మాటలలో యేసుప్రభుని జీవితము ఆయన త్యాగము, ఆ పాపులను రక్షించే ఆయన శక్తి ఆ క్రూరులకు తెలిసేటట్లు చెప్పెను. దుర్మార్గ మార్గమున సంచరిస్తున్న ఆ శంభో క్వింబోల హృదయము, ఆ యేసు మహాత్ముని ప్రేమవల్ల కరగినది.

"అయ్యో ఈయననుగూర్చి ఇదివరకే యెందుకు ఎరగకపోయితిగదా!" అన్నాడు శంభో "ఏసుప్రభువా! మమ్మల్ని కరుణజూడు" అన్నాడు.

తాను వేదనా అధోగతిలో ఉండికూడ, టామ వారిద్దరుగూడ ఏసుయే తమ రక్షకుడని ఎరుగుదురుగాక యని వారికై ప్రార్థించెను. ఆతని ప్రార్థన ఫలించినది.

—:0:—

రెండు రోజులు తరువాత ఒక యువకుడు లిగ్రీగారింటికి వచ్చి ఆ ఇంటి యజమానిని గురించి వాకబుచేసెను. ఆయనయే షెల్బీగారి కుమారుడగు జార్జి షెల్బీ.

సెయింటుక్లేరీ చనిపోయిన తరువాత, ఒఫీలియా వ్రాసిన లేఖను, పోస్టువారు కొన్ని నెలలు నిలుపుదల చేశారు. అది షెల్బీసతికి అందేటప్పటికి ఆమె భర్త షెల్బీగారు చాల జబ్బుస్థితిలో ఉన్నారు. ఆమె ఆయనకు ఉపచారాదులు చేయుటలోనే కాలము సరిపోయెను. అయినా యెలాగో తీరికచేసికొని మిస్ ఒఫీలియా ఇచ్చిన వకీలుకు ఉత్తరము వేసినది. కొద్ది రోజుల తర్వాత షెల్బీసతి భర్త అకస్మాత్తుగా చనిపోయారు. భర్త గతించగనే తన కుమారుడైన శక్తి సామర్థ్యములుగల జార్జి సహాయముతో తన ఇంటి వ్యవహారపు గొడవలలో పడిపోయినది. సెయింటు క్లేరీగారి వకీలువద్దనుంచి టామును వేలములో అమ్మివేయబడ్డాడనేగాని ఇంకా ఏవిధమైన వర్తమానము అందలేదు. ఈ వార్త షెల్బీసతినిగాని ఆమె కుమారునికిగాని ఏమీ సంతోషము కలిగించలేదు. కొన్ని నెలలైన తరువాత జార్జి దక్షిణాదికి తల్లిగారి వ్యాపార సందర్భమున వెళ్ళినపుడు మళ్ళీ టామును కొనుక్కురావటానికి వీలైన ధనమునుగూడ

తీసికొనిపోయినాడు. ఎక్కడున్నాడో యేమిటో తెల్చుకు పోదామనే బయలుదేరి వచ్చాడు. ఎట్లాగయితే నేమి ఆచూకిపట్టి లిగ్రీయొక్క పొలమున్న తావునకే వచ్చాడు.

లిగ్రీని, ఆతని చావడిలో జార్జి కలుసుకున్నాడు. "మీరు న్యూ ఆర్లియన్సులో టాము అనే అతనిని కొన్నారని తెలుసుకున్నాను. వాడు మా తండ్రిగారి క్షేత్రముపై పనిచేసేవాడు. ఆతనినిచూచి కొనగలిగితే కొందామని వచ్చాను" అన్నాడు జార్జి.

"అవునండి" అన్నాడు లిగ్రీ. ఆతని ముఖము నల్లబారిపోయినది. "వాళ్ళని నేను కొన్నాను. నా జీవితములో కల్లా ఇదే నే చేసిన దండగ బేరము. ఇద్దరు ఆడవాళ్ళను తప్పించుకొని పోయేటట్లు చేశాడు. ఎక్కడున్నారో చెప్పడు. నేను ఇదివరకు ఏ నీగ్రోని కొట్టనట్లుగా వానిని చావగొట్టాను. ఇప్పుడు చావు బ్రతుకులలో ఉన్నాడు" అన్నాడు లిగ్రీ.

"ఎక్కడున్నాడు, ఏడీ నన్ను చూడనీయండి" తక్షణము అన్నాడు జార్జి.

ఆ గదిలోనుంచి వెళ్ళుతున్నపుడు ఆతని ముఖము కోపము వెడలగ్రక్కుచున్నది.

అతను ఆ గుడిసెలోనే ఉన్నాడనెను. అక్కడుండి జార్జి గుఱ్ఱాన్ని పట్టుకున్న పిల్లవాడు మారు మాట్లాడకుండా ఆ షెడ్డువైపుకు నడిచి వెళ్ళినాడు.

ఆ భయంకరరాత్రి దాదిగా టాము కొంతు రోజుల నుండి మూల్గటానికికూడ శక్తి లేక అట్లాగే పడియున్నాడు. ఆతనివల్ల సహాయము పొందినవారు ఒక్కరొక్కరే అర్థరాత్రివేళవచ్చి వాళ్ళదగ్గరేముంది గనుక ఇన్ని మంచినీళ్ళిచ్చి భగవత్ ప్రార్థనచేసి వెళ్ళిపోయేవారు. కేసీకూడ పట్టుకుంటారన్న భయమువిడిచి ఆతనిని రాత్రిప్పూట చూడవచ్చేది. తనకోసము ఎమిలీకోసము అతనుపడ్డ బాధ ఆతను ఓర్చుకున్న వేదనవల్ల ఆమె హృదయము బాధపడినది. ఆతని ప్రక్కనే ఏడుస్తూ ప్రార్థించినది. జార్జి ఆ షెడ్డు దాపునకువచ్చి తాను చూచిన దాని కెంతో దిగులుపడ్డాడు. అతను టాము ప్రక్కనే మోకరిల్లి "అంకులు టాము, మిత్రమా" అన్నాడు.

చావబోతున్న ఆతని చెవులో ఈ మాటలు పడినవి. దైవకృప; "నాకు కావలసినదదే. వారింకా నన్ను మరచి పోలేదు. ఇహా సుఖముగా శాంతముగా చావవచ్చు. ప్రభూ! రక్షింపుమువాడా! నా ఆత్మను రక్షించు" అన్నాడు టాము.

"నీవు చావకూడదు అంకులు టాము నిన్ను కొనుక్కొని ఇంటికి తీసుకుపోవటానికి వచ్చాను" అన్నాడు జార్జి.

"అయ్యగారు మీరంతా తీరినాక వచ్చారు. ఆలస్యమైనది. దేవుడే మిమ్మల్ని ఇక్కడకు తీసుకువచ్చాడు. ఇప్పుడు కెంటకీకన్న సుఖవంతమైన గృహానికి పోతున్నాను."

"ఓ చావబోకు ఈ భయంకర ప్రదేశములో నేను నీవు చచ్చిపోతావన్న దానిని ఊహించలేను. నిర్భాగ్యుడవు నీవు !"

"నన్ను నిర్భాగ్యుడనవద్దు. నేను దరిద్రుడనే కాని దానికి నాకు ఋణము దీరిపోయినది. నన్ను దేముడే ఆ మహదానంద దివ్యధామములోనికి తీసుకుపోతున్నాడు. జార్జి అయ్యగారు ఆ ఏసు భగవానుడే నాకు విజయము ప్రసాదించినారు—ఆ పవిత్ర నామమునకు జయమంగళము."

జార్జి ఏమి జవాబు చెప్పలేక పోయినాడు. కాని టాము చేతిని మౌనముతో పట్టుకొన్నాడు. అంతలో టామునకు మాట్లాడుటకు శక్తి వచ్చినది.

"అయ్యగారు మా కోలీతో మీరు నన్ను చూచిన పరిస్థితినిగూర్చి చెప్పకండి; నే నెలా స్వర్గయాత్ర చేస్తున్నానో అదే చెప్పకండి. దానికి భగవంతు డెల్లపుడు నా సరసనే ఉండేవాడని తెలియ చెప్పండి. పాపము మా ఇంటిదానికి నా ప్రేమను తెలియ చెప్పండి. అక్కడున్న యావన్మందిని అడిగినానని చెప్పండి; వాళ్ళంటే నా కెంతో ఇష్టము. నాకు

ఎక్కడ ఎవరున్నా అంతా ఇష్టమే. క్రైస్తవుడుగా ఉండ టము ఎంత గొప్పంటారు అయ్యగారు?"

జార్జి ఆ షెల్ఫ్ తలుపువద్ద లిగ్రి ఉండుట చూచాడు చూచి "ముసలి దెయ్యమా" అని అన్నాడు. వీరికి "ఎప్పుడో ఒకప్పుడు శిక్ష జరుగుతుంది. అదే నా కానంద మిస్తుంది" అన్నాడు జార్జి.

"ఆయన భగవంతుని శరణుజొచ్చితే అల్లాంటిదిగాదు" అన్నాడు టాము.

"అది యెప్పటికి జరిగేది గాదనుకుంటాను" అన్నాడు జార్జి.

"వీడిని స్వర్గములో కలుసుకోవడానికి కూడ ఇష్ట పడను."

"అల్లా అనకండి" జార్జి అయ్యగారు "ఈయనే నాకు స్వర్గద్వారపు తలుపులు తెరపించారు—అంతే చాలు."

టాముకున్న శక్తి అంతా పోయినది. వీపువైపున పడుకొని మహా ఆయాసపడుతున్నాడు. విజయజ్యోతి ఆయన ముఖమున వెలుగు నిచ్చింది. చిరునవ్వు నవ్వుతూ "మనలను ఎవరు క్రీస్తుప్రేమనుండి విడదీయగలరు గనుక" అని దీర్ఘనిద్రలో పడిపోయారు.

జార్జి ఇంకా ఆతని ప్రక్కనే కూర్చున్నాడు. "క్రైస్త వుడుగా ఉండుట యెంత గొప్ప" అన్న మాటలు గుర్తు

కొచ్చినవి. రాగా వెనుదిరిగినాడు. ఆతని వెనుకనే లిగ్రీ నిలుచున్నాడు.

"సరే ఈతనివల్ల పొందాల్సిన లాభమంతా పొందావు, మరి ఈతని శరీరానికి నీ కెంత డబ్బు ఇవ్వమన్నావు" అన్నాడు జార్జి.

"నేను చచ్చిన నీగ్రోలను అమ్మేవాడినిగాదు" అన్నాడు లిగ్రీ "కావాలంటే తీసుకుపోయి నీ కిష్టమైన చోట పూడ్చుకో" అన్నాడు.

జార్జి ఆ లిగ్రీని లక్ష్యపెట్టక ఆ పెద్ద బయటనున్న ఇద్దరు ముగ్గురు నీగ్రోలను పిలిచాడు. వాళ్ళ సహాయముతో టామును తన కోటులోనే చుట్టి తన బండిలోనికి ఎక్కించు కున్నాడు. జార్జి తన కళ్ళను లిగ్రీపైన యేకదృష్టిగా ప్రయోగిస్తూ "నీవు చేసిన ఈ హత్యను అధికారులకు తెలియ చేస్తాను. నీకు శిక్ష జరుగుతుందని తెలుసుకో" అన్నాడు.

"చేసుకో" అన్నాడు లిగ్రీ "ఏ కేసును సాక్ష్యమిస్తారో చూస్తాగా."

అప్పుడు జార్జి తన తప్పును తాను తెలుసుకున్నాడు. లిగ్రీక్షేత్రముపై ఒక్క తెల్లజాతివాడు కూడ లేడు. ఇక న్యాయశాస్త్రము రంగుజాతివాని మాటలు ఖాతరు చేయదు.

"ఏమిటి వచ్చిన నీగ్రోను గూర్చి ఇంత రభస" అన్నాడు లిగ్రీ.

ఈ మాటలు జార్జి గుండెను మండించినవి. ఆతని కళ్ళు నిప్పులు గ్రక్కినవి. ఒక్క దెబ్బతో లిగ్రీని నేలమీద పడేట్టు చేశాడు.

జార్జి ఆ బండిని దూరముగా తోలుకుపోయాడు; లిగ్రీ భూమి పొలిమేరను దాటిపోయినాడు. అక్కడున్న పచ్చని కొండపైన టామును పూడ్చిపెట్టినాడు.

తరువాత తనకు సహాయముగా వచ్చిన నీగ్రోలను వెళ్ళవచ్చునని పంపివేసినాడు.

జార్జి తన బీద మిత్రుని సమాధిముందు మోకరిల్లి, "ఓ భగవాన్, ఈ ఘడియనుండి ఈ దేశములో ఒక్క మానవుడు బానిసత్వమనే నిందను పోగొట్టుటకు చేయ గలిగినదంతా చేస్తాను. దీనికి నీవే సాక్షివి" అని శపథము చేశాడు.

"టాము వంటి జీవితము, ఆయన వంటి త్యాగశీలు డున్న కారణము, మనము వారినిచూచి కనికరించుటకు కాదు, కేవలము దుఃఖపడుటకుగాదు. ఆ జీవుల జీవితములోనే భగవత్ స్వరూప దివ్యసౌందర్యము గోచరిస్తుంది. ఆ సౌంద ర్యము అధికారములోగాని, భాగ్యములందుగాని లేదు. అది

టామునంటి నిష్కామ కర్మలందును, పరుల బాధలను తన బాధలుగా భావించి, ప్రేమతో భరించి అనుభవించే సమ దృష్టులందును ఆ భగవంతుని దివ్యస్వరూప సౌంద ర్యము మనకు గోచరిస్తూ ఉంటుంది.

# 26

టామ్ చనిపోయిన తరువాత లిగ్రీ ఇల్లంతటనే ఒక విధమైన భయము సర్వత్రా వ్యాపించిపోయినది. ఏదో పొడుగాటి స్వరూపము రాత్రిపూట కన్పించేదట. దానితో లిగ్రీకే ఒక విధమైన భయము పుట్టినది. అతను తన భయాలు మరచిపోవడానికి ఇంకా విపరీతముగా త్రాగేవాడు. ఒక రోజున ఆ ఇంటి తలుపు తీసే ఉన్నది. కొంత మంది నీగ్రోలు అలా ఏవో రెండు స్వరూపాలు నడిచి ఆ రోడ్డు వైపుగా వెళ్ళిపోయిన వన్నారు.

ఆ రాత్రి కేసీ, ఎమిలినీలు వాళ్ళ దయ్యాలులాగే అలాగే అనేక మైళ్లు ఆ రాత్రిపూట పట్టణమువైపుకు నడిచి వెళ్ళినారు. సూర్యోదయానికి పూర్వమే ఒక అడవిలోనికి పోయి అక్కడ దుస్తులు మార్చుకొని యెవరైనను వస్తారా అని వేచియున్నారు. కేసీ ఒక స్పెయిను దేశపు స్త్రీవలె నల్లని దుస్తులు ధరించింది. ఎమిలినీ పరిచారికవలె దుస్తులు

ధరించినది. ఆమె సామానులను దీసికొనిపస్తున్నది. ఆమె ఆ పట్టణములో ఒక పెట్టెను కొన్నది. ఆ పెట్టెను ఒక పిల్లవానితో పట్టించుకొని వచ్చి ఆమె ఒక సత్రములో దిగినది. అక్కడంతా ఈమెను ఓ ధనికురాలనుకొని అందరు ఎక్కువగా గౌరవించిరి. ఆమె అక్కడే జార్జి షెల్బినిచూచి గుర్తుపట్టినది. ఆ జార్జి షెల్బిగారుకూడా న్యూ ఆర్లియన్సు పడవకై అక్కడ వేచియున్నారు. కేసీ లిగ్రీ ఇంట్లో మేడమీద గదిలోనుంచి ఇదివరకు ఒక మారు జార్జిని చూచినది. మళ్ళీ ఇక్కడ ఆతనిని చూడగల్గినందు లకు ఎంతో సంతోషించినది.

పడవ సాయంత్రము వచ్చినది. రాగానే జార్జి, నల్లని దుస్తులు ధరించిన స్త్రీని ఆమె సామానులతో కూడ ఆ పడవలోనికి యెక్కించి సహాయముచేసి ఆమెకు ఆ పడవలో పైనైనచోటు చూపించేను. ఆ పడవ న్యూ ఆర్లియన్సు చేరకపూర్వమే, తన లాగే ఆమె కూడ మిసిసిపి నదికి ఉత్తరాదికి వస్తున్నదని తెలుసుకున్నాడు. తెలుసుకొనే ఆమెను రెండవ పడవలోనికి కూడ ఎక్కించి సహాయము చేశాడు. ఆ పదిహేనురోజుల ప్రయాణములో ఆమెను బాగా అతడు అర్థము చేసుకున్నాడు. చాల మారులు జార్జికి ఆమెను ఇదివర కెక్కడో చూచినట్లుగా గుర్తుకొస్తు న్నది. అందుకే ఆమెను ఎరిగినట్లుగా తేరిపారచూస్తూ ఉంటే, అదే ఆమెకు భయకారణ మయ్యేది. చివరకు ఆమె తన సంగతంతా నిజము చెప్పేద్దా మనుకున్నది. జార్జి

లిగ్రి ఆ క్షేత్రమునుండి ఎవరు పారిపోయివచ్చినా వారికి సహాయము చేద్దామనే నిశ్చయించుకొనే యున్నాడు; కనుకనే ఆమెతో తాను చేయగల్గిన సహాయమంతా చేస్తానన్నాడు.

కేసీ ప్రక్క గదిలోనే ఒక ఫ్రెంచి స్త్రీ ఉన్నది; ఆమె పేరు మేడమ్ డా. ఆమెకు పన్నెండేళ్ళ కూతురున్నది. జార్జి కెంటకీరాష్ట్ర విషయాలు చెప్పటము విని ఆమె అతనివద్దనుంచి ఇంకా ఇతర సమాచారము వినాలని సర్వము తెలిసికోవాలని ఉన్నది. జార్జి ఆమె గదిలోనే కూర్చొని ఆమెతో మాట్లాడుతూ ఉండేవాడు; మరీ ప్రక్కనే ఉన్న వాళ్ళ సంభాషణంతా వింటూనే ఉండేది.

ఒక రోజున మదాం డా "మీ కెంటకీ ప్రాంతములోనే, ఒక బానిసల యజమాని ఉండేవాడు. ఆతని పేరు హారిస్, ఆతనిని మీ రెరుగుదురా" అని అడిగినది.

"అవును ఎరుగుదునుగాని ఆయనకు మాకు అంత సంబంధ ముండేదిగాదు" అన్నాడు జార్జి.

"ఆతనివద్ద జార్జి అనే రంగుజాతి కుఱ్ఱవాడుండేవాడు. మీ కేమన్నా ఆతని సంగతి తెలుసునా" అన్నది.

"ఓ బాగా తెలుసు" అన్నాడు జార్జి. "నే నాతనిని బాగా యెరుగుదును. ఆతను మా అమ్మగారి పనికత్తెనే

పెండ్లి చేసుకున్నాడు. ఈ మధ్యనే వారు కెనడా పారి పోయారు."

"తప్పించుకు పారిపోయాడా?" అన్నది మదాం డా నిదానముగా "అదంతా భగవంతుని కృప" అన్నది.

జార్జికి ఆశ్చర్యము వేసినది. కాని ఏమి మాట్లాడ లేదు. కొన్ని నిముషాలైన తరువాత మదామ్ డా తెప్ప రిల్లుకొని "అతను నా తమ్ముడే, షెల్బీగారు అవును ఆ జార్జి హారిస్ నా తమ్ముడే. వాడు పిల్లవాడుగా ఉన్నప్పుడే నన్నమ్మి వేశారు. కాని నన్నొక దయగల మంచి యజమాని కొన్నాడు. ఆయన నాకు స్వతంత్రమిచ్చి పెళ్ళిచేసుకున్నాడు. ఈమధ్యనే ఆయన చనిపోయారు. సరే కెంటకీ వెళ్ళి నాతమ్ముళ్ళ విడుదలచేసి తెచ్చుకుందామని బయలుదేరాను" అన్నది.

అతను చాల మంచివాడు నడవడికూడ మంచిదె. తెలి వైనవాడు చాల పైకి రావలసినవాడు. ఎందుకంటే అతను మా ఇంట్లో ఉన్న పిల్లని పెళ్ళిచేసుకున్నాడు గనుక ఆతని సంగతి నాకు బాగా తెలుసును" అన్నాడు జార్జి.

"మరి ఆతని పెళ్ళాము ఎటువంటిది"

"వజ్రపు తునక. మా అమ్మ దానిని సొంత కూతురు వలెనే పెంచినది. మంచి పాటగత్తె కూడాను" అన్నాడు జార్జి.

"ఆ పిల్ల మీ ఇంట్లోనే పుట్టినదా!" అన్నది మదాంచా.

"లేదు మా నాన్నగారు దానిని న్యూ ఆర్లియన్సులో కొన్నారు, మా అమ్మగారి కిచ్చారు. చాల డబ్బుపెట్టి కొన్నారు. దాని అందాన్ని చూచే గాబోలు.

కేసీ జార్జి వీపు వెనుకనే కూర్చున్నది. అందుచేతనే ఆమె ఈ కథ వింటున్నపుడు ఆమె ముఖములోని మార్పులను జార్జి గమనించలేదు. ఇప్పుడు కేసీ జార్జియొక్క చేయి తాకినది.

"ఆ అమ్మాయిని యెవరివద్ద కొన్నారో, ఆతని పేరు మీకు తెలుసునా?" అన్నది కేసీ.

"తెలుసును నేనీ మధ్యనే ఆ అమ్మకపు రసీదు పత్రమును మా నాన్నగారి కాగితాలలోనుండి తీసి చూచాను. ఆ అమ్మిన ఆసామి పేరు సిమ్మన్సుట."

"అయ్యో నా దేముడా, అని కేకవేసి కేసీ నేలమీద మూర్ఛపడిపోయినది.

జార్జి మదాంచాలు ఎంతో నొచ్చుకొని ఆమెకు ఎంతో ఉపచారములు చేశారు. ఆమెకు స్పృహ రాగానే గోడవైపుకు ముఖముపెట్టి పసిపిల్లవలెనే ఏడ్చినది. నరే

భగవంతుడు తన పాలిట ఉన్నాడని తన కూతురును ఎప్పటి కైనా చూడగలనని అనుకున్నది.

తరువాత కథేమున్నది క్లుప్తముగా ఇది. జార్జి ఇంటికి పోయి, ఆ కేసీకి తన తండ్రి ఎలిజానుకొన్న రసీదును తిరిగి పంపించివేశాడు. ఇది ఎలిజా ఆ కేసీ కూతురేనని ధృవపరచింది. సరే ఇలా బాంధవ్యము గలిగిన మదాం డా, కేసీలు, ఆ ఎలిజా జార్జిల వెదక నిశ్చయించు కున్నారు. దానికోసము కెనడాకూడా వెళ్ళారు. అక్కడ కొంత కాలము తరువాత మాంట్రియల్ అనే చోట ఎలిజా జార్జి లున్నట్లు తెలుసుకున్నారు. అక్కడ జార్జి తన తీరిక సమ యములలో చదువుకొనుచు విజ్ఞానతృష్ణను అభివృద్ధి చేసి కున్నాడు.

ఆ జార్జి తన అక్కను ఎలిజా తన తల్లిని కలుసు కొనుట నిజముగా అది ఆశ్చర్యకరమైన సంగతే. వాళ్ళలో మొదట కలుసుకున్నపుడు తమ బానిసత్వబాధబాపి స్వాతంత్ర్య మిప్పించినందుకు, కుటుంబాన్నంతా ఒక తాటిమీాదకు తీసి కొని వచ్చినందుకు భగవంతుని ప్రార్థనలు చేశారు. మోక రిల్లి లేచి, భగవంతుని కృపకు పాత్రులైనామని భక్తి వారిలో వేళ్ళు పాతుకొని పోయినది.

ఈ మార్పు కేసీలో ప్రత్యక్షముగా గాన్పించినది. ఆ నెర్రెచూపులు ఇప్పుడు ఆమె కళ్ళలో లేవు. ఇదివరకు పిచ్చెక్కుతుందనే భయము ఆమె కుండేడిది. తన కూతురు

తనకు దక్కగనే, తన ప్రేమ ఆ పిల్లపై పొంగి పొరలగనే ఆమె ముఖవర్చస్సు మారి ఆమె స్వభావము సాధువై ఆమె ప్రేమార్ద్ర మనస్విని అయింది.

మదాందా తనకున్న భాగ్యమంత తన తమ్ముడి సంసారమునకు వినియోగించ నిశ్చయించినది. జార్జికి విశ్వ విద్యాలయములో చదవాలని అభిలాష యున్నది. అందు కోసము అందరు ఫ్రాన్సుదేశముపోయి చదువుకోవచ్చునుగదా అని నిశ్చయించారు. వారితోకూడ ప్రయాణమైన ఎమిలిసీ పడవలో స్నేహమైన ఒక నావికోద్యోగిని పెళ్ళి చేసికొని ఫ్రాన్సులోనే స్థిరనివాస మేర్పరుచుకొని నిలిచి పోయినది. కాని జార్జికి అది తృప్తి గల్గించలేదు. అతను తన రంగువల్ల ఇతర తెల్లవారితో సమానముగా జీవించగల్గినను అతను దుర దృష్టవంతులైన తన మాతృదేశీయులకు సేవ చేయాలను కున్నాడు. తన అక్కతోను అత్తతోను తన సంసారమును తీసికొని చివరకు ఆఫ్రికాఖండమును చేరాడు.

కేసీ అమెరికా వదలి రాకపూర్వమే తన కొడుకు ఎక్కడున్నాడో అని వెతకటానికి అన్ని ప్రయత్నాలు చేసినది. చివరకు అతను ఎలిజాకన్న కొన్ని సంవత్సరాలకు పూర్వమే పారిపోయినట్లు తెలిసినది. చివరకు అతను కెనడాలో ఉన్నట్లు తెలిసికొని, మదాంగా ఆతనికి ఆఫ్రి కాకు వచ్చుటకు కావలసిన డబ్బును పంపించినది. అక్కడ

తమ స్వదేశములో బహు ఉన్నత భవనములు గల్గిన ఈ మనుష్యులు నియమనంతమైన నడనడి గలవారై, తమ స్వదేశ ప్రజలకు సేవచేయుట యందు అనేక అవకాశములు కల్గిన వారైరి.

## 27

జార్జి షెల్బీ తన తల్లిగారికి తాను ఇంటికి తిరిగి వస్తున్నానని ఉత్తరము వ్రాశాడు. ఆతడు అనేక మాటలు టామునుగూర్చి వ్రాయాలనుకొని ప్రయత్నించాడు కాని వ్రాయలేక పోయినాడు.

ఆరోజు ఇంటిల్లిపాది జార్జి తిరిగివస్తాడని స్వాగతమివ్వడానికని హడావిడిలో ఉన్నారు. సాయంసమయమున షెల్బీసతి నెగళ్ళవద్ద కూర్చుండి కొడుకు బండీ యెప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తున్నది. అప్పుడే వంట తయారైనది, వంటమనిషి క్లోయీ తనకున్న మంచి దుస్తులు ధరించి వడ్డనకు అన్ని ఏర్పాట్లు చేస్తున్నది.

"అమ్మగారు చిన్నయ్యగారికి ఇష్టమైనవన్నీ చేశాను. అయితే అమ్మగారు! అయ్యగారు మా ఇంటాయనను గూర్చి వ్రాయలేదా" అన్నది క్లోయీ.

"లేదే ఏమీ వ్రాయలేదే, ఇవ్వాళే ఇంటికి వస్తానని మాత్రము వ్రాశాడు" అన్నది.

"చిన్నయ్యగారు ఎప్పుడు అంతేనండి. ఏమీ ఎక్కువగా చెప్పనే చెప్పరు. అయితే ఆ ఇంటాయన ఈ పిల్లలను గుర్తిస్తారో గుర్తించరో."

షెల్బీసతి జార్జి ఎందుకు టామునుగూర్చి వ్రాయలేదా అని ఆందోళనలో పడినది. అనేక సంవత్సరాలనుండి కోలీ కలలు కంటున్న శుభదిన మిదిగదా! అనుకున్నది. కోలీ యజమానురాలైన షెల్బీసతి అనుమతితో ప్రక్కనేయున్న రొట్టెల దుకాణములో జీతానికి పనిచేసి ఆ డబ్బంతా టామును కొంటానికని కూడబెట్టినది. ఇప్పుడు ఆ షెల్బీసతిని తాను అప్పుడు దాచనిచ్చిన నోట్లను అవే నోట్లను బల్లమీద పరచమన్నది—దాని ఉద్దేశములో ఇంటాయన టాము వాటిని చూచి ఎంతో ఇష్టాతారనుకున్నది. అందుకే ఆ నోట్లని ఆ బల్లమీద పెట్టింది.

"మా పోలిని చూడండమ్మా ఆయన ఇల్లు వదలి వెళ్ళేటప్పుడు అడ్డాలబిడ్డ. ఇప్పుడో చక్కగా రొట్టెల కాల్చగలుగుతున్నది. నేను ఈ రొట్టెను ఆయన కిష్టమొచ్చేటట్లు కాలుస్తున్నాను" అన్నది కోలీ.

అంతలో బండి చక్రాలచప్పుడు వినిపించినది.

"జార్జి అయ్యగారు" అని కోలీ తలుపు దగ్గరకు ఉరికినది. షెల్బీసతి కొడుకును ఆశీర్వదించడానికి వెళ్ళింది. కోలీ ఆతురతతో అవతలనున్న చీకటిలోనికి తన దృష్టులు సారించినది.

అయ్యో అభాగ్యురాలా అని ఆమె చేతులను జార్జి పట్టుకున్నాడు. "ఆతనిని దీసికొనిరావటానికి ఏమైనా ఇచ్చేవాడిని; కాని ఆ పుణ్యాత్ముడు వేరొక దేశానికి వెళ్ళాడు" అన్నాడు జార్జి. ఆ కోలీ ఏమి చెప్పలేదు. వాళ్ళందరు ఆ గదిలోకి వెళ్ళారు; ఇంకా ఆ నోట్లు ఆ బల్లమీదనే ఉన్నవి.

"అమ్మా" అన్నది కోలి, వణుకుతున్న చేతులతో ఆ నోట్లను పట్టుకొని యజమానురాలికిస్తూ, వీటిని మళ్ళీ చూడటానికి మనసొప్పదు, నే ననుకున్నదంతా అయినది. ఆ దక్షిణాది క్షేత్రాలలో ఎక్కడో చంపేశారు" అన్నది.

కోలి ధైర్యముతో ఆ గదినుండి వెళ్ళిపోయినది. కాని షెల్బీసతి ఆమె వెంటవెళ్ళి ఆమె చేయి పట్టుకున్నది.

"అభాగ్యురాలవే కోలీ అయ్యో కోలీ" అన్నది. కోలి తన యజమానురాలి భుజముపై తలవుంచి వెక్కి వెక్కి ఏడ్చినది.

" అమ్మా నా గుండె పగిలిపోయేనమ్మా " అన్నది కోలీ.

"అవునే అది అటువంటిదేనే, నేను అనుభవించాను" అన్నది షెల్బీసతి. "అదంతా మానవమాత్రుల చేతిలోలేదే ఏసుభగవానుడే నీకు ధైర్యమిస్తాడే, ఆయనే టామును ధైర్య మిచ్చారే" అని షెల్బీసతి ఓదార్చినది.

అప్పుడు తడబడుమాటలతో జార్జి టామ చెప్పిన ప్రేమహితాభిలాష సందేశమును వినిపించాడు. టామ చేసిన అనన్య త్యాగమునుగూర్చి ఆశ్చర్యనంతమైన ఆతని చావును గూర్చి జార్జి కోలీకి చెప్పాడు.

ఒక నెలరోజులైన తరువాత ఒక రోజున జార్జి తన పనివారి నందరిని పిలిపించాడు. ప్రతివారికి స్వాతంత్ర్యప్రదాన పత్రము చదివి ఇచ్చేశాడు. అప్పుడు అనేక మంది ఆనంద ముతో అరచారు, కొందరు కళ్లవెంబడి నీరు కార్చారు. అక్కడ చేరిన వారందరు చప్పట్లు చరిచారు. అనేక మంది ఆతని చుట్టుచేరి, అయ్యా మమ్మల్ని పంపించి వేయకండి అన్నారు.

"అయ్యా ఇంతకన్న ఎక్కువ స్వాతంత్ర్య మక్కర లేదండీ, అలవాటుపడిన ఈ ప్రదేశాన్ని వదలలేమండీ, మిమ్మల్ని అమ్మగార్ని విడిచి ఉండలేమండి అన్నారు."

అందరు నిశ్శబ్దముగా ఉన్నప్పుడు "మిత్రులారా మీరు నన్ను విడిచివెళ్ళాల్సిన అవసరములేదు. ఈ క్షేత్రము ఈ ఇల్లు జరగాలంటే మీరంతా ఉంటేనే జరుగుతుంది. మీ అవసరము మా కెంతైనా ఉన్నది. కాని ఉన్న తేడా అల్లా నా కే విపత్తువచ్చినా మిమ్మల్ని మటుకు ఇహ అమ్మటానికి వీలులేదు. నేను గూడ మీరిక్కడే ఉండాలని కోరుతున్నాను. మీరు చేసే పనికి నేను సక్రమజీతా లిస్తాను. మీరు మీ డబ్బును వినియోగించుకోటము తెలిసికోవాలి. మీరు స్వతంత్రులై జీవించటము అలవరచుకోవాలి. మిమ్మల్ని ఆ పద్ధతిలో పెట్ట డానికి, నడిపించడానికి నే నెంతో సంతోషముతో ఉపాధ్యాయత్వము వహిస్తాను. మన మందరము ఈ స్వాతంత్ర్య ఆనంద సమయమున ఆ భగవంతుని ప్రార్థిద్దాము" అన్నాడు జార్జి.

అంతలో ఎస్టేటుమీద పని చేసి చేసి తల నెరిసి గ్రుడ్డివాడైన ముసలి నీగ్రో లేచి "భగవంతుని మన మందరము ఈ సమయమున ప్రార్థిద్దాము" అనగానే అక్కడనున్న యావన్మంది నిలుచుని భగవంతుని హృదయపూర్వకముగా భక్తితో "ఏముక్తి ప్రదాతయగు దేవునకు, సర్వానుగ్రహదక్షునకు వందనము" అని ముక్తకంఠముతో పాడిరి ప్రార్థించిరి.

ఆ ప్రార్థన అయిపోగానే జార్జి "మరొక్క సంగతి మీరంతా మన అంకులు టామును ఎరిగే ఉన్నారు. ఆతని సమాధివద్ద దైవసాక్షిగా నే నొక్క బానిసనుగూడ ఉంచుకోనని శపథము చేశాను. కనుక నా నిమిత్తమై యెవ్వరుగూడ

తన బంధు మిత్రులకు దూరమై ఏకాకిగా ఏక్షేత్రముపైన ఆతనివలె నావాళ్ళు చచ్చుట నా కిష్టములేదు. కనుక మీరు ఈనాడు స్వాతంత్ర్య ఆనంద తన్మయులై యున్నారంటే, ఇదంతా ఆతనివల్లనేయని నమ్మండి. ఆతనిని మరచిపోకండి, ఆతని వంశానికి మీ విశ్వాసాన్ని ప్రేమను చూపండి. మీలో ఎవరైనా ఆ అంకులు టాము ఇల్లు చూచినప్పుడల్లా, ఆతని అడుగు జాడలలో నడచి, ఆతనివలె విశ్వాసము, నమ్మకము గల్గిన క్రైస్తవునివలె ఉండవలెననే భావమును మీలో ప్రతి ఒక్కరు జ్ఞప్తికి దెచ్చుకొనండి." అని ఆ విముక్తి ప్రదాత యగు జార్జి షెల్బీ స్పష్టమార్గ సూచనచేశాడు.







# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B151 |
| పుస్తకం పేరు | బానిస బ్రతుకు |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | YES |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 179 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | IV, 173 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Preethy |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |